ానంద బొమ్మల



# మదర్ థెరిసా



రచన:

శ్రీమతి ధనం



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ .................. విజయవాడ-2

ప్రథమ ముద్రణ : 1993

ముఖచిత్రం : వి. యస్. ప్రకాష్

లోపలి బొమ్మలు : బాపి



ముద్రణ :
బాలాజీ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ-4

వెల : 15-00

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీ సాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు 2 భాగాలు
" భేతాళకథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మదర్ థెరిసా
" రవీంద్రనాథ ఠాగూర్
" యోగి వేమన
" భగత్‌సింగ్
" అంబేద్కర్
" యశపాల్‌కపూర్
" భగవతీ చరణ
" సుభాస్ చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" పరమానందయ్య శిష్యులు
" శ్రీ వెంకటేశ్వరలీలలు
" శ్రీ అయ్యప్ప లీలలు
" శ్రీ రామపట్టాభిషేకం
" జై వీర హనుమాన్
" పల్నాటివీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తి మహాత్మ్యం
" శ్రీ శైలక్షేత్ర మహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీల కథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగలీలలు
" శ్రీ రాఘవేంద్రలీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు

# మదర్ థెరీసా

## మదర్ థెరీసా మహనీయ సేవలు

అది కలకత్తా నగరం. అందులో "మోతీజీల్" అనబడే మురికివాడ. ారు, కూలీవారు నివసించే ప్రదేశం. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి ది. దుమ్ము ధూళితో కూడిన వాతావరణ పరిసరాలు అవి. అప్పట దరిద్రం విస్తోంది. బీదరికం రాజ్యమేలుతుంది. అప్పటి పరిస్థితులను చూసిన మానవ దయం చలించక మానదు. అట్టి వాళ్ళను మానవతా హృదయంతో సముద్ధ న పుణ్యమూర్తి, మదర్ థెరీసా.

అది రోగాలకు పుట్టినిల్లు. వాళ్ళను ప్రశాంతంగా తుది ఊపిరిపీల్చుకోవ కి ఆశ్రయాన్ని కల్పించిన మహోన్నత వ్యక్తి ఆమె.

నికృష్ట జీవితాన్ని గడుపుతూ తినడానికి తిండిలేక, కట్టుకోడానికి గుడ్డలు లేక ఆకలితో అలమటించే బీదప్రజలను ఆదుకున్న మానవతావాది ఆమె.



అనాథ బాలలను చేరదీసిన కరుణామూర్తి, దయాశీలి మదర్‌థెరిసా

విద్యావసతులు లేక అల్లరి చిల్లరిగా తిరుగాడే బీద బాలబాలికలను చేర దీసి వారికి విద్యాబుద్ధులు నేర్పిన పవిత్ర విద్యామూర్తి ఆమె. వాళ్ళ బ్రతుకులకు బంగారుబాట వేసిన పూజ్యనీయురాలు ఆమె.

తల్లిదండ్రులులేక తల్లి ప్రేమకు నోచుకోని అనాథ బాలలను చేరదీసిన కరుణామూర్తి ఆమె. వారికి మాతృ ప్రేమను అందించిన దయాశీల, మాతృ మూర్తి ఆమె. ఆమెయే మదర్ థెరిసా.

కలకత్తా నగరంలో ఒక చిన్న పాఠశాల స్థాపనతో ప్రారంభమైన ఆమె మానవసేవ నేడు దేశ, విదేశాలందు ప్రపంచమంతటా ఒక మహావృక్షము వలె వేళ్ళను నాటుకొని దినదినాభివృద్ధి చెందుచున్నది. మదర్ థెరిసా ఒక్కతే సంకల్పించి ఆమె స్థాపించిన సేవాలయాలు, సేవాకార్యక్రమాలు నేడు పాఠశాలలుగా, అన్నదాన సత్రాలుగా, అనాథ శరణాలయాలుగా, కుష్ఠురోగుల చికిత్సాలయాలుగా, సేవా శిక్షణ శిబిరాలుగా రూపుదిద్దుకొని అనేక వేలమంది సేవికలతో విలసిల్లుతున్నాయి. వీటన్నింటి వెనక ఆమెకు బీదప్రజలు, అనాథ బాలలు మొదలయిన వారిపై గల ప్రేమ, వారి ఆర్థికాభివృద్ధికి, మనుగడకు సాయపడవలెనన్న దృఢదీక్ష, పట్టుదల, కార్యశీలత మనకు స్పష్టంగా ప్రతిబింబించుచున్నవి.

ఈనాడు మదర్ తెరీసా పేరు విననివారు భారతదేశంలో ఒక్కరూ ఉండరు. భారతదేశమేకాదు ప్రపంచం మొత్తంలో ఆమె గూర్చి తెలియని వారుం

దరంటే అతిశయోక్తిలేదు. అంత విశిష్టమైన ఖ్యాతి నార్జించిన ఆమె జీవితచరిత్ర గూర్చి విపులంగా తెలుసుకుందాము.

మదర్ థెరిసా అసలుపేరు "అగ్నస్ గోన్‌షా బొజాక్షువా" అందరూ ఆమెను అగ్నస్ అని ముద్దుగా పిలిచేవారు. అగ్నస్ 1910 ఆగస్టు 27వ తేదీన యుగోస్లావియాదేశంలోని 'స్కోప్జీ' అనే గ్రామంలో జన్మించింది. ఆమె తల్లి దండ్రులు అల్బేనియా జాతికి చెందినవారు. తండ్రిపేరు నికోలా బొజాక్షువా. అల్బే నియా నుండి తరలి వచ్చిన చిన్నబిల్డింగు కాంట్రాక్టరు. తల్లిపేరు డ్రోండా, మత పరమైన భావాలు కలిగివుండేది. అగ్నస్‌కు ఒక తమ్ముడు, చెల్లికూడా ఉండేవారు. వారిదొక చింతలులేని ఆనందమయమైన కుటుంబము.

అగ్నస్ తండ్రి గొప్ప ధార్మికుడు. తల్లికూడా ఇతరులకు సేవచేయా లన్న పరోపకార గుణము కలిగి ఉండేది. అగ్నస్‌కు కూడా చిన్ననాడే తల్లి దండ్రుల మంచి గుణాలు అలవడినాయి.

అగ్నస్ ఎంతో చురుకయిన, తెలివయిన పిల్ల. చిన్నతనం నుంచి ఆమె మైదానాల్లో, పార్కుల్లో తనతోటి పిల్లలతో కలిసి ఆటలాడుతూ ఉండేది. ఆదే విధంగా స్కోప్జీలోని సర్కారు పాఠశాలకు కూడా హాజరయ్యేది. అక్కడ కూడా తన ప్రతిభను ప్రదర్శించి పాఠశాల ఉపాధ్యాయులను అబ్బుర పరచేది. అంతేగాక పేదవారియందు, ముసలివాళ్ళకు సేవలు చేయుటయందు అగ్నస్ చూపించే

ఆసక్తికి అచ్చటి ఉపాధ్యాయులు సైతం ఆశ్చర్యపోయేవారు. ఆమెచేసే ఈ పనులు తోటి విద్యార్థులకు మార్గదర్శకంగా ఉండేవి.

స్కోప్జిలోని ప్రజలందరికీ మతపరమైన భావాలు ఎక్కువ. వారు మతపరమైన విషయాలలో ఎక్కువ పట్టింపులు కలిగి ఉండేవారు. అగ్నస్ కుటుంబము



అగ్నస్ కుటుంబము కాథలిక్ మతమునకు చెందినది.

కాథలిక్ మతమునకు చెందినది. ఆ రోజుల్లో కాథలిక్ మతముకు చెందినవారు ఎక్కువగా చర్చిలకు వెళ్ళేవారు కాదు. కానీ అగ్నస్ కుటుంబము తప్పకుండా

చర్చిలకు వెళ్ళేవారు. ఇది చాలా అరుదయిన సంఘటన. అగ్నిస్ తన జీవితంలో చాలా భాగం చర్చి వ్యవహారములలోనే గడిపింది. ఆమె చాలా చురుకుగా ప్రవర్తించేది. చర్చికి సంబంధించిన అన్ని వ్యవహారములలో ఆమె చురుకుగా పాల్గొనేది.

అగ్నిస్‌కు సంగీతమంటే మక్కువ ఎక్కువ. అగ్నిస్ తన చెల్లి "ఆగా"తో కలిసి చర్చిలో భగవంతునిపై పాటలు పాడుతుండేది. ఆమె పాటలు ఎంతో మధురంగా ఉండేవి. ఆమె సంగీత ప్రావీణ్యాన్ని చూసి చర్చి పెద్దలు ఒక దేవ కన్యలా పాడుతుంది అనుకొనేవారు. ఈ విధంగా అగ్నిస్ చర్చిలో ఒక ముఖ్య ఆకర్షణగా తయారయ్యింది.

అగ్నిస్ తండ్రి అల్బేనియా జాతీయుడు. మరియు అతనికి స్వతంత్ర భావాలు ఎక్కువ. అతనికి రాజకీయాలతో కూడా సంబంధముండేది. అతడు రాజకీయాలలో విరివిగా పాల్గొనేవాడు. అందుచే అతనిలో అల్బేనియాకు స్వాతంత్ర్యం కావాలన్న భావం గట్టిగా నాటుకొన్నది. రాజకీయ సభలలో అతడు ఈ విషయాన్ని గూర్చి గట్టిగా ప్రస్తావించేవాడు. చివరకు వారి ఇల్లు కూడా రాజకీయ సభలకు నిలయమైనది.

అగ్నిస్ తన ఇంట్లో రాజకీయ సభలు జరుగుచున్నపుడు ఆ విషయాలను చురుకుగా గమనించు చుండేది. ఆ సభలలో ఆమె తండ్రి అల్బేనియా స్వాతంత్ర్యము గూర్చి ప్రస్తావించినపుడు ఆమెకు అతనిపై యెంతో ప్రేమ.

గర్వం కలిగేది. ఈ సంఘటనలు ఆమెలో కూడా స్వాతంత్ర్య భావాలు కలగ డానికి యెంతో దోహదం చేశాయి. ఆమె తండ్రి నుండి ఎన్నో పాఠాలు నేర్చు కొన్నది. అవి అన్నీ ఆమె పసి మనస్సుపై గట్టి ప్రభావాన్ని చూపాయి. తనది ఏమీ తప్పేమీలేనప్పుడు వెనుదిరగరాదన్న భావం ఆమెలో నాటుకొన్నది.

అది 1919వ సంవత్సరం. అప్పటికి ఆగ్నస్‌కు తొమ్మిదిసంవత్సరాల వయస్సు. ఒకరోజు రాత్రి ఆగ్నస్ తండ్రి ఒక రాజకీయ సభకు వెళ్ళి తిరిగి వచ్చాడు. అక్కడే విందుచేసి వచ్చినట్లున్నాడు. కానీ అతడు ఇంటిని విడిచి వెళ్ళి నప్పటికి, తిరిగి వచ్చినప్పటికి అతనిలో ఎంతో తేడావుంది. ఇంట్లోకి తూలుతూ రావడాన్ని గమనించిన ఆగ్నస్, ఆమె తల్లి ఏమైందని అడుగుతూ నికోలాను గట్టిగా పట్టుకున్నారు. ఆగ్నస్, తండ్రినోట నుండి రక్తము రావడాన్ని గమనిం చింది. తల్లి, భర్తకు ఏమైందని ప్రశ్నిస్తూ ఉంది. నికోలా తనకేమీ కాలేదని చెప్తూనే నిలువెల్లా కుప్పకూలిపోయాడు. వెంటనే అతనిని వైద్యశాలకు తరలిం చారు. ఆ రోజులలో ఉన్న ఉన్నతమైన వైద్య సేవలను కూడా అతనికి అందిం చారు. కానీ అవేమీ అతనిని కాపాడలేక పోయినవి. చివరకు ఆయనను పరిశీలి స్తున్న వైద్యుడు అతడు విషప్రయోగానికి గురయ్యాడని, ఇక తనవల్ల కాదని చెప్పేసాడు. నికోలా ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

నికోలా రాజకీయంగా ఎంతో ఎత్తుకుఎదగడాన్ని సహించలేని రాజకీయ

పెద్దలే నికోలాకు విషాహారం ఇచ్చి అంతం చేసారు. ఈ విధంగా వాళ్ళు అతని అంతంచేసి అతని నోరు మూయించగలిగారు.



నికోలా తనకేమీ కాలేదని చెపుతూనే నిలువెల్లా కుప్పకూలిపోయాడు

అట్టి పరిస్థితులలో డ్రోంజ, ఆగ్నెస్, పిల్లలు ఎంతో మానసిక వ్యధకు, దుఃఖానికి గురయ్యారు. డ్రోంజ అట్టి స్థితిలో కూడా తన మనస్సును దిటవు చేసుకొని పిల్లలను ఓదార్చింది. జరిగిదంతా ఒక విషమ పీడకలగా వర్ణించింది. ఆ జరిగిపోయిన విషయాన్ని మరచిపోయి భవిష్యత్తు గూర్చి ఆలోచించమని బోధించింది. నికోలా ఆశయ స్థాపనకై కృషిచేయాలని గట్టిగా బోధిం

చింది. ఇవన్నీ చెప్పటం వరకు బాగానే వున్నది కానీ ఆచరణలో ఆమె ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొన్నది.

నికోలా మరణానంతరము కొంతకాలానికే నికోలాతో కలిసి అతని కాంట్రాక్టులలో సహచరుడుగా ఉన్న వ్యక్తి తన పార్టనర్‌షిప్‌ను రద్దు చేసుకొన్నాడు. దీనితో అగ్నస్ కుటుంబానికి నికోలా వ్యాపారం నుండి ఏమీ ఆదాయం అందకుండా పోయింది. కేవలం ఆ ఆదాయంపైనే ఆధారపడి జీవించుచున్న వారికి ఇది అశనిపాతంలా తాకింది. వారు ఎంతో క్రుంగిపోయారు. వారికి రోజులు గడుచుటే కష్టమైపోయింది. చివరకు ఇంట్లోని వస్తువులను ఒక్కొక్కటి అమ్ముకొని జీవించవలసి వచ్చినది. అలా వస్తువులన్నింటినీ తీసుకొని వెళుతూ ఉంటే పిల్లలు ఎంతో విచారంతో, దైన్యముతో, బిక్కముఖములతో చూచుచుండడాన్ని డ్రోండా సహించలేక పోయింది. కానీ అంతకుమించిన మార్గము లేక మౌనముగా ఊరుకొని పోయేది. చివరకు వాళ్ళ ఇంట్లోని వస్తువులన్నీ ఒక్కొక్కటిగా తరిగిపోయి వాళ్ళు వున్న ఇల్లు మాత్రము మిగిలింది. దాన్ని మించిన ఆదాయం ఒక్క పైసా కూడా వాళ్ళకు లేదు.

కానీ డ్రోండా, ఆమె పిల్లలు మనస్థైర్యాన్ని ఏమాత్రం కోల్పోలేదు. పిల్లల విషయంలో డ్రోండా ఎంతో శ్రద్ధ తీసుకునేది. దిక్కులేనివారికి దేవుడే దిక్కు అన్నట్లు భగవంతునికోసం మనం సేవలు చేస్తే భగవంతుడే మనకు మేలు కలిగిస్తాడన్న భావాన్ని డ్రోండా గట్టిగా నమ్మింది. ఆ ఆత్మధైర్యముతోనే

డ్రోండా ఒక బట్టల దుకాణాన్ని తన స్వంతముగా ప్రారంభించినది. వస్త్రములు, రగ్గులునేసి వాటిని అమ్ముతూ వుండేది. ఎంబ్రాయిడరీ చేసిన బట్టలు, స్వెట్టర్లు,



ఆత్మ ధైర్యముతోనే డ్రోంవా ఒక బట్టల దుకాణాన్ని స్వంతముగా ప్రారంభించింది

ఇతర వస్తువులను ఎంతో అందముగా తీర్చిదిద్ది ఆ దుకాణంలో అమ్ముతూఉండేది. ఆ వస్త్రములు అక్కడి ప్రజలను ఎంతో అలరించినవి. దీనితో కొంతకాలానికే ఆమె వ్యాపారము మంచి ఊపునందుకొన్నది.

బట్టల వ్యాపారము మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగుతుండ డంతో పిల్లల చదువులకు ఎట్టి ఆటంకము కలుగలేదు. ఆ విధంగా వాళ్ళు తమకు వున్న ఒక్క ఆధారమయిన తమ ఇంటిని నిలుపుకొన్నారు. కుటుంబము మొత్తము సమిష్టిగా పరిస్థితులను అర్ధము చేసుకొని సుఖముగా జీవించుచుండిరి.

ఆ సమయంలోనే అగ్నస్ తల్లికి సహాయంగా ఉండటానికై పండ్ల తోటలందు పండ్లు సేకరించుట వంటి చిన్న చిన్న పనులు చేయనారంభించింది. అప్పుడే ఆమె మిషనరీల ద్వారా జరిగే సేవల గూర్చి తెలుసుకున్నది. వాటివైపు ఆకర్షింపబడింది. అంతేగాక తండ్రి మరణానంతరము కలిగిన నష్టముల నుండి, జీవితంలో ఎన్ని కష్టాలు సంభవించినా వాటిని ఎదుర్కొని నిలువగల ఆత్మ స్థయిర్యాన్ని సంపాదించుకున్నది. దైవభక్తి, ఇతరులకు సేవచేయవలెనన్న భావాలు ఆమెలో వృద్ధిచెందటం ప్రారంభమయింది.

డ్రోండా యొక్క దుస్తుల వ్యాపారము కొంచెము సంతృప్తికరంగా ఉండడముతో, ఆమె దుస్తులలోని నాణ్యతను గూర్చి తెలుసుకోవడానికి అనేక మంది డ్రోండాను సందర్శించేవారు. కాని వారిలో చాలామంది ఒకప్పటి నికోలా యొక్క స్నేహితులే. వారు నికోలా మరణానంతరం అతని వ్యాపారాల నుండి విడిపోయినవారే. తిరిగి డ్రోండా వ్యాపారము కొంచెముచక్కబడుట చూచి మరలా ఆమెను చేరినారు.

కానీ డ్రోండా వారియెడల చాలా జాగ్రత్తగా వ్యవహరించేది. అసలే

ఆమెకు మతపరమయిన భావాలు ఎక్కువ. దానికి తోడు భర్త మరణించిన తరువాత పరిస్థితులవలన మరింత దైవభక్తి కలిగింది. దానితో వాళ్ళు ఇంట్లో అల్బేనియా స్వాతంత్ర్యము వంటి రాజకీయ విషయాలు ప్రక్కకునెట్టి నికోలా ఆత్మశాంతికి భగవంతుని ప్రార్ధనలందు గడపడం మొదలుపెట్టారు. అంతే కాకుండా సాధ్యమయినంత వరకు పేదప్రజలకు సాయపడాలన్న భావం కూడా కలిగివారికి విరివిగా సాయపడుతుండేవారు.

ఒకనాడు డ్రోండా చర్చినుంచి తిరిగి వచ్చుచుండగా దారిలో ఒక యువతి కనిపించెను. ఆమె తీవ్ర అస్వస్థతకు లోనై బాధపడుచుండెను. డ్రోండా ఆమెను సమీపించి ఆమె విషయమును గూర్చి ప్రశ్నించగా ఆమె తన పరిస్థితిని వివరించెను. తానొక బీద కుటుంబమునకు చెందిన దానిననియు, తన కుటుంబము లోనివారు తన ఆరోగ్యమునకై సహాయమందించుటకు నిరాకరించినారని బాధతో తెల్పినది. అంతేకాకుండా తన కుటుంబములోని వారు తనకు ఆశ్రయమును కూడ కల్పించక తనను ఇంటినుండి తరిమివేసినారని దుఃఖించుచుండగా, డ్రోండా మనస్సు కరిగిపోయినది.

వెంటనే డ్రోండా ఆమెను తీసుకొని తన ఇంటికి చేరుకున్నది. ఆమెనొక అతిథిగా తన పిల్లలకు పరిచయం చేసినది. ఆ పిల్లలు, మిత్రుల సహాయంతో డ్రోండా ఆమెకు ఆశ్రయాన్ని కల్పించినది. సరియైన ఆహారాన్ని, వైద్య సేవలను అందివ్వగలిగింది. ఈ విధంగా ఆమెను కంటికి రెప్పవలె చూచుచున్నది. చిట్ట

చివరకు డ్రోండా యొక్క నిర్మలమయిన సేవల ఫలితంగా ఆ యువతి తిరిగి ఆరోగ్యాన్ని పొందగలిగింది. ఆ తరువాత ఆ యువతి ఆ ఇంటిని విడిచి వెళుతూ



డ్రోండా దారిలో పడియున్న పేదయువతిని ఇంటికి తీసుకొచ్చి
ఆమె ఆరోగ్యము కలిగేదాకా సపరిచర్యలు చేసినది.

మీ రుణం ఎప్పటికీ మరవలేనంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నది. అప్పుడు డ్రోండా శేషజీవితాన్ని మంచిపనులకు వినియోగించి పవిత్రంగా జీవించమని ఆమెను ఆనంద ముగా సాగనంపినది.

ఈ సంఘటన తిలకించిన ఆగ్నస్ మనస్సులో తల్లి వలె తాను కూడా బీదప్రజలకు, రోగపీడితులకు సేవలుచేసి వారికి మంచి ఆరోగ్యం ప్రసాదించాలి అన్న ఆలోచన గట్టిగా నాటుకున్నది. ఈ విధంగా ఆమె తన తండ్రి నుండి ధైర్యంగా మాట్లాడడం, తాను చేయదలచింది ఖచ్చితంగా అమలుపరచడం, అన్యాయాలను ఎదిరించటం వంటి గునాలను నేర్చుకోగా, తల్లి నుండి మతపరమైన విశ్వాసాలు, దైవభక్తి, బీద, రోగపీడిత ప్రజల సంక్షేమానికి పాటుపడటం వంటి విషయాలను ఆచరణ పూర్వకంగా నేర్చుకున్నది. ఇవే ఆమె ఆ తరువాత ఎంతో గొప్ప ఖ్యాతిని సంపాదించడానికి ఎంతో దోహదం చేసాయి.

అట్టి ఉన్నత భావాలతో ఆగ్నస్ చర్చిలో నడుపబడే సొడాలిటీ అనబడే సమూహములో చేరింది. ఆ సొడాలిటీలోని సభ్యుల ముఖ్య పని ఇతర దేశములలోని మిషనరీలనుండి చర్చికి వచ్చే ఉత్తరములను చదువుట. ఆగ్నస్ ఈ ఉత్తరాలను ఎంతో శ్రద్ధగా చదువుతూ ఉండేది. ఆ రోజుల్లో "జెసూట్" అనబడే మిషనరీలు భారతదేశంలోని బెంగాలు రాష్ట్రంలో ఉండేవి. అచ్చటినుండి వచ్చిన ఉత్తరాలను ఆగ్నస్ ఎంతో ఆసక్తితో చదువుతూ ఉండేది, వాటి ద్వారా అచ్చటి పరిస్థితులను అర్థం చేసుకొనేది.

ఒకసారి జెసూట్‌లోని మిషనరీల ఫాదర్ బెంగాల్‌లోని పరిస్థితులను వివరిస్తూ అప్పటి పరిస్థితులు దారుణంగా ఉన్నాయనీ, అనేక వేలమంది ప్రజలు

ప్రతిదినము ఆకలి బాధద్వారా చనిపోతున్నారని వ్రాసెను. ఆ ఉత్తరాన్ని చదివిన ఆగ్నస్ ఎంతో బాధపడింది. ప్రతిదినం, అనేక వేలమంది మరణించడం, అందునా ఆకలిబాధ ద్వారా అన్నది చాలా విచారకరమైన విషయంగా పరిగణించింది.

తాను వారికి ఏ విధంగానయినా సాయపడాలి అన్న భావం ఆనాడే ఆ లేత మనసులో నాటుకొన్నది. కానీ తనకు ఇంకా పెద్ద వయస్సు రాలేదని, సమయం కోసం వేచియున్నది. లేత మనస్సులో ఏదయినా ఒక సమస్య గూర్చి గట్టిగా నాటుకొని దానికై కృషి చేయదలిస్తే ఆ సమస్య పరిష్కారం తనంత తానుగా వారు కనుగొనగలరు. అదే విధంగా ఆగ్నస్‌లోకూడా వారికి సాయపడాలన్న భావం ఎప్పుడూ ఆమెను వీడిపోలేదు. ఇదే ఆమె ఆ తరువాత భారత దేశానికి రావడానికి ప్రేరణ కలిగించింది.

ఆగ్నస్ తమ్ముడయిన లాజర్ ఆ సమయంలో తండ్రి పేరు ప్రతిష్టలతో ఒక మిలిటరీ పాఠశాలలో ప్రవేశించెను. అతడు ఎక్కువగా తండ్రి అడుగుజాడలలో నడుస్తూ తండ్రినే అనుసరించేవాడు. కొంతకాలానికి అతడు ఆ మిలటరీ పాఠశాలయందు విద్య పూర్తిచేసుకొని ఆల్బేనియా రక్షక దళములో చేరిపోయినాడు. అతడిని డ్రోండా, ఆగ్నస్ ఎంతో విచారముతో సాగనంపిరి. కానీ

లాజర్ ఆ తరువాత మరలా తాను ఆగ్నస్‌ను చూడటం సంభవించదని అనాడు అనుకోలేదు. కారణం ఆగ్నస్ భారతదేశం వెళ్ళిపోవడమే.



ఆగ్నస్ ఇతర దేశములనుండి వచ్చే 'ఫాదర్'లను మిషనరీ సర్వీసులగూర్చి
విపులంగా అడిగి తెలుసుకునేది

లాజర్ వెళ్ళిపోయిన తరువాత స్కోప్జీలో ఆగ్నస్ కుటుంబ పరిస్థితులు మెరుగుపడ్డాయి. ఆగ్నస్ పాఠశాలకు వెళుతూనే తల్లికి చేదోడువాదోడుగా వుండేది. అన్ని పనులూ తనేచేస్తూ సొడాలిటీ మీటిందులకు కూడా హాజరయ్యేది.

అగ్నస్‌కు మిషనరీ సర్వీసులో పాల్గొనాలన్న కుతూహలం నానాటికీ పెరుగుతూనే వున్నది కాని దానికోసం ఏమి చేయాలన్నదే ప్రశ్న. ఇతర దేశముల నుండి వచ్చే "ఫాదర్"లను మిషనరీ సర్వీసుల గూర్చి విపులంగా అడిగి తెలుసుకునేది. వారు చెప్పే విషయాలను ఎంతో శ్రద్ధతో ఆలోచించేది. వాటిని ఎంతో వేగంగా గ్రహించేది అంతేకాదు తన జీవితంలో వాటన్నింటినీ ఆచరించేది కూడా. ఆ విధంగా ఎన్నో విషయాలను "ఫాదర్"లను అడిగి నేర్చుకొనేది. ఈ విషయంలో భారతదేశంనుండి మిషనరీ సర్వీసుపై వచ్చే వారినుండి భారతదేశం లోని పరిస్థితులను గూర్చి చాలా విషయాలను సేకరించుకున్న ఈ విషయాలలో ఆమె ఎంత ముందున్నదో కొంతకాలానికే బయటపడింది.

ఒకనాడు ఫారిన్‌నుండి ఒక చర్చి ఫాదర్ మిషనరీ సర్వీసుపై ఆ ప్రాంతమునకు రావడం జరిగింది. అతడు ఒక సొడాలిటీ మీటింగులో పిల్లలకు ఒక ప్రపంచ పటమును చూపి, "ఈ పటములోని చుక్కలు వేనినిగూర్చి తెలియజేస్తున్నాయో తెలుసా?" అని ప్రశ్నించాడు. వెంటనే అగ్నస్ "తెలుసు" అని లేచి నిలబడింది. అతడు దగ్గరకు రమ్మని "ఏమిటో చెప్పు" అనగా, ఇవి ప్రపంచంలోని వివిధ దేశాలలో ఉన్న మిషనరీ సర్వీసులను సూచించే పటమని జవాబిచ్చింది. అంతేకాదు భారతదేశంలోని బెంగాలు రాష్ట్రములో 1925లో సొసైటీ ఆఫ్ జీసస్ వారిచే స్థాపించబడినవి. మరియు ఇవి చాలా పూర్వకాలం నుండి ఉన్నవి. వీటిని స్థాపించినవారు......" అంటూ భారతదేశంలో మిషనరీ

అన్నింటిని గూర్చి వివరిస్తూ ఉంటే ఫాదర్ యెంతో ఆశ్చర్యపోయాడు. యెంతో ఆనందపడ్డాడు. ప్రత్యేకించి ఆ చిన్నపిల్ల ఒక్కొక్క మిషనరీ పేరు చెప్పడమే కాకుండా వాటన్నింటికీ వివరణలుకూడా ఇవ్వడాన్ని చూచి అతడు మరింత సంతోషము చెందాడు.



పారిస్‌నుండి వచ్చిన ఒక చర్చి ఫాదర్ ఆగ్నెస్ ఆసక్తిని గమనించి ఇండియాలో బెంగాలు రాష్ట్రంలో ఎన్నో మిషనరీ శాఖలున్నాయని, నీవు ఒకసారి సందర్శించి వాళ్ళద్వారా భారతదేశంలో మిషనరీ సేవలు చేయవచ్చని సూచించారు.

ఆ రోజు ఆ సమావేశానంతరం అతడు ఆగ్నస్‌ను ప్రత్యేకంగా కలుసు కొని ఆమెలోని కుతూహలాన్ని ఎంతో మెచ్చుకున్నాడు. అంతేకాదు నీలోని కుతూహలానికి, ఆసక్తికి నేను తప్పకుండా ప్రోత్సాహకాన్నిస్తాను. అంటూ ఐర్లాండు దేశంలో తనకు తెలిసిన ఒక మిషనరీ సర్వీసు అడ్రసు ఆమె చేతి కిచ్చాడు. "అది ఐర్లాండు దేశంలో సిస్టర్స్ ఆఫ్ లొరెట్టా వారిచే నడపబడు తుంది. వారికి భారతదేశంలోని బెంగాలు రాష్ట్రంలో వున్న కలకత్తా నగరంలో ఎన్నో మిషనరీ శాఖలున్నాయని" తెల్పి "నీకు ఆసక్తి ఉంటే వాళ్ళను ఒకసారి సందర్శించు. వాళ్ళద్వారా నీవు భారతదేశంలో మిషనరీ సేవలు చేయవచ్చు" అని సలహా ఇచ్చాడు. ఇది ఆగ్నస్‌కు ఎంతో సంతోషకరమైన విషయం. దీనితో భారతదేశం వెళ్ళాలని కన్న కలలకు ఒక రూపం వచ్చింది. దీనిని భగ వంతునినుండి తనకు వచ్చిన సందేశంగా భావించింది.

అప్పటికి ఆగ్నస్‌కు పదునెనిమిది సంవత్సరాల వయస్సు. యెంతో ఆనందంగా తిరగాలని, భవిష్యత్ గురించి ఎన్నో బంగారు కలలు కనే వయస్సు. అట్టి వయస్సులోకూడా తన కోరికల్ని అదుపులో పెట్టుకొని మనస్సుకు కళ్ళెం బిగించి జీవితాన్ని మానవసేవకే అంకితం చేయాలని నిర్ణయించుకున్నది. అదే విషయాన్ని ఒకసారి తన తల్లి, చెల్లెలు ఆగాకు తెలిపింది. తాను ఈ విష యాన్ని భగవంతుని సందేశముగా భావించుచున్నానని తన ఖచ్చితమైననిర్ణయాన్ని తెలియజేసింది. తాను ఐర్లాండు దేశంలోని సిస్టర్స్ ఆఫ్ లొరెట్టానుండి భారత

దేశంలో ఒక మఠకన్యగా మారనున్నానని తెల్పి అందులకు వారి అనుమతిని కోరింది. ఎంతో సంతోషముతో ఆ విషయాన్ని గూర్చి తన సోదరుడు లాజర్‌కు ఉత్తరాన్ని వ్రాసింది.

కానీ లాజర్ నుండి వచ్చిన ప్రతిస్పందన ఆమెను అంతగా ప్రోత్సహించే విధంగాలేదు. అతడు "మఠకన్య జీవితం ఎంతో కష్టనష్టములకు మూలమైనది. ఎంతో చిన్నదానివైన నీవు ఆ మఠకన్య జీవితాన్ని ఇష్టపడి మఠకన్యగా మారడం అర్థంలేని విషయం. నీవు నీ జీవితాన్ని నాశనం చేసుకుంటున్నావని" హెచ్చరించాడు. కానీ ఆగ్నస్ ఆ విషయాన్ని చిరునవ్వుతో స్వీకరించింది. కానీ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. తిరిగి లాజర్‌కు జవాబువ్రాస్తూ "నీవొక సైనికునిగా నీదేశ ప్రజల రక్షణకు ఎంతో సేవచేస్తూ ఎంత గొప్పగా భావిస్తున్నావో, నేనుకూడా ఈ ప్రపంచంలోని పేద, రోగపీడిత ప్రజలకు సేవలుచేస్తూ వారి ఉన్నతికి కృషిచేయడాన్ని అంత గొప్పగానే భావిస్తున్నాను" అని తన వైఖరిని తెలియజేసింది.

ఆ తరువాత కొంతకాలానికే 1928వ సంవత్సరము నవంబరు నెలలో ఆమె ఐర్లాండు దేశము చేరుకోవడానికి రైలులో అడుగుపెట్టింది. అది ఆమె జీవన జీవితంలో క్రిష్టియన్ సర్వీస్‌లోనికి పెట్టిన మొట్టమొదటి అడుగు. ఇల్లు విడిచి ప్రజాసేవకై బయలుదేరుతూ మోపిన మొదటి పాదం. ఇక ఆ తరువాత ఆమె తన జీవితంలో మరెప్పుడూ వెనుదిరిగి చూడలేదు.

1928వ సంవత్సరము నవంబరు 29వ తేదీన అగ్నస్ ఐర్లాండులోని మిషనరీలో చేరింది. అక్కడ ఆమె కొంతకాలము మాత్రమే ఉండింది. కానీ అక్కడి వారందరినీ ఎంతో ఆనందంలో ముంచింది. ఆమె వెళ్ళిపోయిన తరువాత అక్కడివారందరూ ఆమెగూర్చి ఎంతో గొప్పగా పొగుడుకునే స్థాయికి ఎదిగింది.

ప్రారంభంలో అగ్నస్ ఐర్లాండులోని మిషనరీలో ఒక విద్యార్ధిగా చేరింది. అక్కడ ఇంగ్లీషుభాషను ధారాళంగా మాట్లాడటం నేర్చుకున్నది. ఆమెకు అప్పటికే అల్బేనియన్, సెర్బో భాషలందు ప్రావీణ్యమున్నది. కానీ తనముఖ్య కోరిక భారతదేశాన్ని సందర్శించుట. ఆ రోజుల్లో భారతదేశం బ్రిటీషువారి ఆధీనంలో ఉండడంతో ఇంగ్లీషుభాష అవశ్యకతను గూర్చి తెలుసుకొని దానిని అభ్యసించినది. కొంతకాలానికే ఆమె ఆ భాషలో కూడా ప్రావీణ్యాన్ని సంపాదించి ఉపాధ్యాయురాలయ్యింది. ఇక ఆమె భారతదేశము సందర్శించుటకు అన్ని పరిస్థితులు సిద్ధముగానున్నవి.

అనుకున్నట్లుగానే ఆ మిషనరీ పెద్దలు అగ్నస్‌ను భారతదేశం పంపడానికి నిర్ణయించారు. ఒకనాడు వారు అగ్నస్‌ను పిలిచి "నిన్ను భారతదేశంలోని డార్జిలింగ్‌లోని మిషనరీకి తరలించుచున్నాము. ఇక నీవు నీ సేవా కార్యక్రమాలను అక్కడ ప్రారంభించు" అని తెలియజేసారు. అగ్నస్ ఎంతో సంతోషించింది. అంతేకాదు ఆ మిషనరీ పెద్దలు అగ్నస్‌తో "ఇక నీవు నీ పాత జీవితానికి స్వస్తి చెప్పి నూతన జీవితాన్ని ప్రారంభించు. అదే విధంగా నీ నూతన జీవితానికి సరి

పడు నూతనమైన పేరు ఎన్నుకో"మనిరి. అగ్నస్ కొంతసేపు ఆలోచించి "థెరిసా" అన్న పేరును ఎన్నుకున్నది. "ఇకనుండి నీవు సిస్టర్ థెరీసా అన్న ఆ



మిషనరీ పెద్దలు "పాత జీవితానికి స్వస్తిచెప్పే సమయంలో కొత్త జీవితానికి సరిపడు కొత్తపేరును ఎన్నుకోమనిచెప్పిరి. అగ్నస్ "థెరీసా" అనే పేరును ఎన్నుకొన్నది

పేరుతోనే చెలామణి అవుతావు. నూతన నామముతోపాటు నూతన ఉత్తేజాన్ని కూడా నింపుకొని నీ సేవాకార్యక్రమాలలో ముందుకుసాగు" అని వారు అగ్నస్‌ను సాదరంగా దీవించి భారతదేశానికి సాగనంపిరి.

భారతదేశంలోని హిమాలయ పర్వతాలు, కోనీఫర్ అడవులు థెరిసాకు స్వాగతం పలికాయి. ఇక్కడి ప్రకృతి థెరీసాను ఎంతో ఉల్లాసపరిచింది. ఇటు వంటి ప్రకృతి సౌందర్య దృశ్యంతో ఎంతో ఉల్లాసపరచే వాతావరణంలో థెరిసా డార్జిలింగ్‌లో రెండు సంవత్సరాలు తన సేవలు కొనసాగించింది.

డార్జిలింగ్‌లో రెండు సంవత్సరాలు పనిచేసిన తరువాత తెరిసా కలకత్తా నగరం చేరుకుంది. కలకత్తా రావడంతోనే అక్కడి మురికివాడలోని దయనీయ దృశ్యాలు ఆమె కంటపడ్డాయి. అవి ఆమెను ఎంతో క్రుంగదీశాయి. తాను ఇంత వరకు ఉత్తరాల ద్వారా చదివి తెలుసుకున్నది. ఆనాడు ప్రత్యక్షంగా చూచి ఆమె మనస్సు తరుక్కుపోయింది. వారిపై ఆమెకు జాలి, దయ, ప్రేమ ఒక్కసారిగా కలిగాయి. తాను వారికి తప్పకుండా సేవచేయాలి అని మనస్సులో గట్టిగా నిర్ణయించుకున్నది. అందుకోసం సమయంకోసం వేచియున్నది.

మే నెల 24వతేదీ 1931వ సంవత్సరంలో థెరీసా మొదటిసారిగా సిస్టర్ ఆఫ్ లోరెట్టో మఠకన్యగా ప్రమాణంచేసింది. ఆ తరువాత ఆమె ఎంటల్లీ ప్రాంతంలోని లొరెట్టో కాన్వెంట్‌లోని సెయింట్‌మేరీ హైస్కూల్‌లో ఉపాధ్యాయురాలుగా చేరింది. అక్కడి విద్యార్థులకు ఆమె చరిత్ర, భూగోళం మున్నగునవి బోధించేది. ఎంటల్లీ ప్రాంతము ఎక్కువగామధ్య తరగతి ప్రజలతో కూడినది.

అక్కడి తోటి ఉపాధ్యాయులు థెరీసాను ఎంతో ప్రేమపూర్వకంగా ఆహ్వా నించారు.

థెరీసా అక్కడ పదిహేడు సంవత్సరాలపాటు ఉపాధ్యాయురాలిగా పనిచేసింది. ఆ కాలంలో ఆమె ఒక గొప్ప ఉపాధ్యాయురాలుగా యెంతో మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నది. ఆ పాఠశాలలో పనిచేస్తుండగానే "డాటర్స్ ఆఫ్ సెయింట్ ఆన్" అనే స్వదేశీ సంస్థ అధిపత్యాన్ని కూడా ఆమె చేతిలో పెట్టారు. ఈ సంస్థకూడా సమాన ఆశయాలుకలదే. వీరందరూ నీలంరంగు చీరలు ధరించి పాఠశాలల్లో విద్యాబోధన చేస్తుండేవారు.

సెయింట్ మేరీస్ పాఠశాలలో ఉపాధ్యాయురాలుగా పనిచేస్తూ ఆమె సంపాదించిన పేరు ప్రఖ్యాతులు త్వరలోనే ఆమెను ఆ పాఠశాల ప్రధానోపాధ్యా యురాలుగా చేసాయి. ఉపాధ్యాయురాలుగా ఈమె విద్యార్థులతో ఎంతో స్నేహ ముగా ప్రవర్తించేది. అంతేకాదు తోటి ఉపాధ్యాయులతో, చుట్టుప్రక్కల ప్రజ లతో ఎంతో సహృద్భావముతో మెలిగేది. ఈమెకు ఈ సమయంలోనే అనేక మంది చుట్టుప్రక్కల ప్రాంత ప్రజలతో అవినాభావ సంబంధములు ఏర్పడాయి.

కానీ మురికివాడలలోని పేద ప్రజల పరిస్థితులు చూసినప్పుడు మాత్రం థెరీసా మనస్సుకు అంసతృప్తే మిగిలేది. తన ముఖ్య పనేమిటో తనకు తెలుసు.

కానీ "తాను పేద ప్రజలకు సాయం చేయుచున్నానా? వారి కష్టాలు, బాధలు తీర్చ డానికి తన చేతనయినంతా చేస్తున్నానా లేదా? వారి కన్నీళ్ళు పోగొట్టడానికి ఏ



బీద ప్రజలకు సేవలు చేయాలని అది ఇంతవరకూ నెరవేరలేదని
ఏకాంతంలో థెరీసా ఆలోచించేది

మాత్రమయినా సమయాన్ని వెచ్చిస్తున్నానా లేదా?" అని తనలో తాను ఎన్నో ప్రశ్నలు వేసుకునేది. "పేదప్రజలకు సాయంచేయడానికై ఇంతదూరం వచ్చాను. కానీ తానుచేస్తున్న సాయం ఎవరికి చెందుతున్నది? బీదప్రజలకా? రోగపీడితులకా?

తను చేస్తున్నది అంతా గొప్పవారికిమాత్రమే. ఇదేనా నా నుండి భగవంతుడు యదార్థంగా కోరుకున్నది?" అని ఎంతో బాధపడేది. కానీవారికి సేవలుచేయాలన్న భావం మరింత గట్టి పడడానికి ఇది ఉపయోగపడిందే కానీ తనను నీరు కారనీయ లేదు.

ఇటువంటి అనుకూల పరిస్థితులలో రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. అప్పుడు భారతదేశం బ్రిటీషువారి ఆధీనంలో ఉండడంతో బ్రిటీషువారు భారత దేశంకూడా తమ తరపున యుద్ధంలో పాల్గొంటుందని ప్రకటించడంతో గత్యం తరంలేక భారతదేశంకూడా యుద్ధంలో పాలుపంచుకోవలసి వచ్చింది. ఆ యుద్ధ ప్రభావాలను ఎదుర్కోవలసి వచ్చింది. అనేక విపత్కర పరిస్థితులను యుద్ధపరి ణామాలను అనుభవించవలసి వచ్చింది.

ఇతరదేశములనుండి సాధారణంగా మనదేశానికి ఓడలద్వారా దిగుమతి అయ్యే ఆహారధాన్యాలన్నీ మిలటరీ సైనికులకి తరలింపబడ్డాయి. ఆనాడు భారత దేశంలో ఆహారధాన్యాలు ముఖ్యంగా చాలావరకు ఇతరదేశాలనుండే దిగుమతి అయ్యేవి. ఇవి అన్నీ మిలటరీ విభాగానికి తరలించడంతో దేశంలో ఆహారధాన్యాల సరఫరాకు ఎంతో పెద్ద దెబ్బ తగిలింది. ఇది దేశంలో కరువుకాటక పరిస్థితులు విజృంభించడానికి దారితీసింది. ఆ భయంకర కరువు కాటకాలవల్ల ఐదు మిలియన్ల మంది ప్రాణాలు కోల్పోయారు.

ఇట్టి భయంకర పరిస్థితులలో దేశం ఒకప్రక్క అల్లల్లాడుతుండగా

మరొకప్రక్క కులవైషమ్యాలు మరింత పురివిప్పి నాట్యమాడుతున్నాయి. ఒదివైపు యుద్ధం ముగియబోతున్నా దేశంలోని అస్థవ్యస్థ పరిస్థితులు చక్కదిద్దబడకపోగా మరింత క్షీణించాయి. 1946వ సంవత్సరంలో వర్గ, మత వైషమ్యాలు మరింత దిగజారాయి. హిందువులు, ముస్లిమ్‌లు ఒకర్నొకరు పొడుచుకోవడం, జరిగాయి. ముస్లింలు "డైరెక్టుఏక్షన్ దినముగా" ప్రకటించారు. ఆరోజు అనేక మంది స్త్రీ పురుషులు ఇనుపరాడ్లు, గునపాల దెబ్బలకు గురయ్యారు. కత్తుల పదునుకు బలయ్యారు. మంటల తీవ్రతకు ఆహుతయ్యారు. ఆనాడు అనేకమంది హిందువులను దుకాణాలలో ఉన్నవారిని ఉన్నట్లుగానే దుకాణాలతో సహా తగులబెట్టి అగ్ని కీలలకు ఆహుతిచేశారు. అనేక మృతదేహాలు రోడ్లపై కుప్పలుగా కూలిపడ్డాయి. రక్తం ఏరులా ప్రవహించింది. రాబందులు ఆ దేహాలకై పోటీపడసాగాయి. ఒకనాడు అనేక వేలమంది ప్రజలతో కళకళలాడిన వీధులు నిర్మానుష్యమయిన మృత కళేబరాలతో నిండి రక్తపు ఏరుకు జన్మస్థానాలయ్యాయి.

థెరిసా ప్రతీ సంవత్సరం కొండ ప్రాంతాలలోని డార్జిలింగ్‌కు వెళ్ళి వస్తుండేది. అదే విధంగా థెరిసా తన వార్షిక యాత్రకోసం డార్జిలింగ్ కొండ ప్రాంతానికై సెప్టెంబరు నెల పదవతేదీ 1946వ సంవత్సరంలో బయలుదేరింది. ఈ రోజును ఆమె జీవితంలో ఎంతో ప్రేరణ కల్గించిన "ప్రేరణదినంగా" పేర్కొనవచ్చు.

యుగోస్లావియన్ మిషనరీకి చెందిన థెరిసా భారతదేశంలోని ఒక

ప్రయాణికులకారులో ప్రయాణం చేస్తున్నది. చుట్టుప్రక్కల పచ్చటి అడవులు, కొండప్రాంతాలు, చెట్లు, ఎత్తయిన హిమాలయ పర్వతాలతో ప్రకృతివాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా, హాయినిగొల్పే విధంగా ఉన్నాయి. కాని థెరీసా తనలో పేరుకొనిపోతున్న అసంతృప్తిగూర్చి తన ఆత్మతో చర్చించుకుంటోంది "నాకు తెలుసు. నేను తప్పకుండా చేయవలసిన ముఖ్యకార్యక్రమాలు" అని అనుకుంది. ఆ ప్రశాంత వాతావరణంలో ఆమె భగవంతునితో మాట్లాడింది. భగవంతునిపిలుపు అందుకున్నది. దాని ప్రకారం ఇక దారిద్ర్యాన్ని అనుభవించేవారి, బీదా బిక్కా ప్రజలకు సేవలు చేయడానికి సమయం ఆసన్నమైందని భావించింది. అందుకోసం తాను ఎంటలీలోని మిషనరీ నుండి బయటకు రావడానికి నిర్ణయించుకున్నది. బయటకు వచ్చి పేదలకు సాయంచేయడం ప్రారంభించాలనుకున్నది. ఈ సంఘటన తెరీసా జీవితంలో ఒక గొప్ప అధ్యాయాన్ని ప్రారంభించింది.

థెరీసా కలకత్తాకు తిరిగివచ్చింది, రాగానే ఎంటలీలోని మఠకన్యల అధికారిణిని సమీపించింది. తాను భగవంతుని పిలుపు అందుకున్నానని, దానిననుసరించి ఎంటలీలోని లోరెట్టో కాన్వెంట్ విడిచి బయటకువెళ్ళి సేవలు చేయాలని నిర్ణయించుకున్నానని తెల్పింది. అందుకు తనను అనుమతించ వలసిందిగా వారిని వేడుకున్నది. అందుకు మఠాధికారిణి "నీవు మఠాశ్రమాన్నివిడిచి బయటనుండి ఏ విధంగా సేవలు చేయగలవు? నిన్ను ఏ విధంగా అర్థంచేసుకోవాలి. ఇట్టి పరిస్థితులలో నీవు బయట ఎక్కడ నివసిస్తావు?" అంటూ వాపోయింది. దానికి తెరీసా

"నా సర్వస్వాన్ని భగవంతునికే అర్పించాను. ఆయన పిలుపు ననుసరించి నేను బీదాతి బీదప్రజలకు సేవలు చేయాలి. ఇందుకోసం నేనుకూడా వారితోపాటుగా వారి మురికివాడలలో వారితోకలిసి జీవిస్తూ వారికి సేవలు అందజేయాలి. అందు



ఎంటల్లీ లోని మతకన్యల అధికారిణిని కలసి తాను కాన్వెంట్‌ను విడిచి బయటకు వెళ్ళి సేవలు చేయాలని నిర్ణయించుకున్నానని అందుకు తనని అనుమతించమని వేడుకున్నది.

కోసం నేను ఎంటల్లి విడిచివెళ్ళక తప్పదు. ఇంతకంటే నేనేమీ చేయలేకపోతే భగవంతుని పిలుపును వమ్ము చేసినట్లే" అని తెల్పి వారి అనుమతి కోరింది.

థెరీసా యొక్క సేవాభావాలు, మంచిగుణం, నిస్వార్ధసేవా పరాయణత్వం బాగా తెలిసిన మతాధికారిణి థెరీసాను అభినందిస్తూ "నీకు తప్పకుండా అనుమతి లభిస్తుంది. నీవు మతకన్యగానే ఉంటూ మఠాశ్రమంనుండి బయట నివసిస్తూనే నీ సేవలు సాగించవచ్చు. ఈ రోజే నీ విన్నపాన్ని రోమ్‌లోని మిషనరీకి పంపిస్తా"నని ధైర్యం చెప్పింది.

కానీ ఆ రోజుల్లో ఒక మతకన్య మతకన్యగానే ఉంటూ ఆశ్రమం విడిచి బయటనుండి సేవలుచేయడం చాలా అరుదయిన, అసంభవమైన సంఘటన. అందుకు ఆ రోజులలో ఆశ్రమానియమాలు, పద్ధతులు అంతగాఅనుకూలంగాలేవు. కానీ థెరీసా కోరిక మన్నించి ఆమె విన్నపాన్ని రోమ్ పంపించారు. దాని నుండి వచ్చే జవాబుకోసం థెరీసా రెండు సంవత్సరాల సమయం నిర్వేతుకంగా, నిస్సహాయురాలయి ఎదురుచూడవలసివచ్చింది. తనకు భగవంతునినుండివచ్చిన పిలుపును ఆచరణలో పెట్టడానికి ఆ రెండు సంవత్సరాల కాలాన్ని థెరీసా రెండునిమిషాల్లా గడిపింది. ఆ సమయంలో కూడా ఆమె లోరెట్టో కాన్వెంట్‌లో ఉపాధ్యాయురాలుగానే పనిచేస్తూ గడిపింది.

ఆ సమయంలోనే ఆమెకు భారతదేశ పౌరసత్వం లభించింది. భారత ప్రభుత్వం ఆమెకు భారత పౌరసత్వాన్ని ఇచ్చి ఎంతో ప్రపంచఖ్యాతి నార్జించింది. భారత పౌరసత్వాన్ని ఆమె ఎంతో ఆనందంతో స్వీకరించింది.

ఆ తరువాత ఏప్రిల్ 2, 1948లో రామ్‌లోని "పోప్‌పియాస్"ల నుండి థెరీసాకు ఒక పత్రం వచ్చింది. అతనిలోని పవిత్ర భావాలు, నిర్మలమైన మనస్సు థెరీసా మఠాశ్రమంనుండి బయటకుపోయి సేవలు చేయడానికి అనుమతి లభించింది. థెరీసా ఎంతో ఉప్పొంగిపోయింది. తన జీవితంలో ఒక మహోత్తర కార్యం సాధించడానికి మార్గం సుగమం అయిందని ఆనందపడింది. "తాను భగవంతుని పిలుపుననుసరించి నిస్వార్ధంగా పనిచేయుటకు నిర్ణయించుకున్నాను కనుకనే తనకు అనుమతి లభించిందని లేకపోతే తనకా అవకాశం వచ్చేది కాదని" అను కొంది. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనుకున్నది.

ఆ తరువాత తొందరలోనే ఆమె మఠాశ్రమాన్ని విడిచిపెట్టింది. అపుడు ఆ ఆశ్రమ నిర్వాహకులు ఆమెకు సహాయంగా కొంత ధనం ఇవ్వ చూపితే చిరునవ్వుతో తిరస్కరించింది. భగవంతుని ఆజ్ఞమేరకు తాను సేవ చేయ డానికి వెళితే తనకు ఆ భగవంతుడే మేలు, సహాయం చేస్తాడన్నది. ఆశ్రమాన్ని విడిచివెళ్ళడం థెరీసాకు స్కోప్జీలో తన తల్లిని చెల్లిని విడిచివచ్చినప్పటికంటే ఎంతో బాధనిపించింది. ఆశ్రమాన్ని విడిచి ఎక్కడ ఉంటుంది? ఎక్కడినుండి సహాయం పొందుతుంది? ఏమి సేవలుచేస్తుంది? ఎలా జీవనాన్ని గడుపతుంది? అన్న ప్రశ్నలు అందరినీ వేధించసాగాయి. తొందరలోనే ఆ ప్రశ్నలన్నింటికీ జవాబు దొరికింది.

థెరీసా తాను పేదవారికి చేయుసేవలో భాగంగా వారిని రోగవిముక్తి

చేయడానికి అవసరమైన కనీస వైద్య విధానాలయినట్టి కట్లుకట్టడం, ఇంజక్షన్ల ఇవ్వడం వంటివి నేర్చుకోవాలనుకున్నది. అందుకోసం ఆమె కలకత్తానుండి 240 మైళ్ళ దూరంలో ఉన్న బీహార్ ముఖ్యపట్టణమైన పాట్నా వెళ్ళింది. అక్కడ



"హోలీ ఫామిలీ హాస్పిటల్"కు చేరుకుని మూడు నెలలపాటు నర్స్ శిక్షణ పొందినది.

అమెరికన్ మెడికల్ మిషన్‌వారిచే నడుపబడుతున్న "హోలీ ఫామిలీ హాస్పటర్" కు చేరుకున్నది. ఇది థెరీసా ఆశ్రమం విడిచివచ్చిన తరువాత తీసుకొన్న మొదటి చర్య.

ఆమె అక్కడ మూడు నెలలపాటు కఠోర దీక్షతో వైద్యవిధానంలో ఉన్న మెళకువలను ఆకళింపు చేసుకున్నది. ఆ కాలంలో "నర్సు" శిక్షణ పొందింది. సాధారణమైన జబ్బులకు ఏ మందులు ఎలా వాడాలో, యింకా కుష్ఠు రోగులకు కట్లుకట్టడం, ఇంజక్షన్లు యివ్వడం మొదలయిన పనులన్నీ చక్కగా నేర్చుకున్నది. దీనితో తన లక్ష్యానికి ఆమె మరంత దగ్గరయ్యింది. అక్కడ ఉన్నప్పుడే పేదప్రజలు తీసుకునే ఆహార పదార్థాల స్థాయిలోనే తానుకూడా ఆహారం తీసుకోవడం మొదలుపెట్టింది. జీవించడానికి అవసరమయిన కనీసస్థాయి ఆహారాన్ని తీసుకునేది.

అక్కడ మూడునెలల నర్సు శిక్షణ పూర్తిచేసిన తరువాత డిశంబరు నెలలో తిరిగి కలకత్తా నగరాన్ని చేరుకున్నది. ఇక తన లక్ష్యానికి ఎంతో దగ్గరయింది. "తాను పేదవారికి సేవ చేయడానికి వెళుతున్నాను" కాబట్టి మతపరమైన దుస్తులను వాడరాదనుకున్నది. అందుకే ఆమె రెండు దశాబ్దములనుండి ధరిస్తున్న మఠకన్య దుస్తులయిన తెల్లటి ఫ్రాక్ తీసివేసింది. అందుకు భిన్నంగా ఆమె తెల్లటి నూలుచీరెను ధరించింది. ఇది పేదప్రజలు ధరించే వస్త్రములకు ఎంతో దగ్గరైనది. ఆమె ఆ చీరకు నీలరంగు అంచునుమాత్రం జోడించింది.

కలకత్తా నగరంలోని రైల్వేస్టేషనులో థెరిసా కాలు పెట్టేసరికి ఆమె వద్ద కేవలం ఐదు రూపాయలు మాత్రమే వున్నవి. ఎంతో కఠినమైన, సాధించవలసిన పని ఆమె ముందున్నది. అయినా థెరిసా చలించలేదు ఆమె లొరెట్టో

కాన్వెంటుకు కాకుండా అమెరికన్ మిషనరీ వారిచే నడపబడుతున్న "లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ది పూర్"లో చేరింది. దానిలో ముసలివాళ్ళకు, రోగపీడితులకు సేవలు చేస్తూ వుండేవారు. అక్కడే తెరిసాకూడా రెండు నెలలపాటు ముసలి వాళ్ళకు రోగపీడితులకు సేవలుచేస్తూ గడిపింది. కాని "వాళ్ళందరూ తన వద్దకు వచ్చి సేవలుచేయించుకొనుటకంటే తానే వాళ్ళవద్దకు వెళ్ళి సేవలు చెయ్యవచ్చు. ఎక్కువమందికి సేవలు చేయవచ్చు. ఎక్కువ ఫలితం సాధించవచ్చు"అని భావించు కున్నది. అందుకే ఆశ్రమం నుండి బయటకువెళ్ళి మురికివాడలోని పేదవారితో కలసి జీవించాలనుకుంది.

ఆ మరుసటి రోజే ఆశ్రమాన్ని విడిచి బయటకు వచ్చింది. తనకు ఎంతో పరిచయమున్న లోరెట్టో కాన్వెంటు ప్రక్కనేవున్న "మోతీజీల్" అన్న మురికివాడకు బయలుదేరింది. అక్కడ వున్న చెరువును చూసింది. అది మంచి నీళ్ళ చెరువు. అందులోనే పశువులను కడగడం, మనుషులు స్నానాలు చేయడం గమనించింది. అక్కడ పిల్లలు ఆ చెరువు సమీపంలో మురికిలో ఆడుతూ వుండ డాన్ని చూసింది. ఆ చెరువు ప్రక్కనే ఒక మర్రిచెట్టు వున్నది. ఆ చెరువు, ఆ మర్రిచెట్టునే తాను ప్రారంభించేపనులకు కేంద్రంగా చేసుకోవాలనుకుంది. అక్కడి పిల్లలకోసం ముందుగా ఒక విద్యాలయాన్ని స్థాపించాలనుకుంది.

అక్కడిపిల్లలను కొంతమందిని ప్రోగుచేసి "అందరు పిల్లలవలె మీకు కూడా చదువు నేర్చుకోవడం, విద్యాలయానికి వెళ్ళడం ఇష్టమేనా! యిష్టమయితే

నేను మీకు చదువు నేర్పుతాను" అని అన్నది. అంతట ఆ పిల్లలు ఎంతో ఆనందంతో 'ఇష్టమే' అన్నారు. వెంటనే తెరిసా ఆ చెట్టుక్రిందే ఒక పాఠశాల స్థాపించింది. ఆమెవద్ద పాఠశాలకు అవసరమయిన బ్లాక్‌బోర్డ్‌గానీ, చాక్‌పీసులు



"మోతీజీల్" అనే మురికివాడలో మొట్టమొదట పిల్లలకు పాఠాలుచెప్పడం ప్రారంభించింది.

గానీ లేవు. వాటిని కొనడానికి అవసరమయిన ధనంకూడా లేదు. అయినా తెరీసా నిరుత్సాహ పడలేదు.

ఆ రోజే అదే ప్రాతంలో తెరీసా తన నిర్ణయానుగుణంగా పాఠశాల ప్రారంభించింది. అక్కడి నేలపైనున్న గడ్డిని కొంతమేర తొలగించి, చదును చేసింది. ఒక చిన్న కర్రముక్కను తీసికొని దానిని ఉపయోగించి నేలపై వ్రాయడం మొదలుపెట్టింది. తొందరలోనే తన పాఠశాల స్థాయిని విస్తృత పరచాలని భావించింది. ఆరోజు తెరీసా వద్దకు అయిదుగురు విద్యార్థులు హాజరయ్యారు. తొందరలోనే ఆ సంఖ్య నలభైకి చేరుకున్నది. ఆమె ఆ బీదపిల్లల తల్లిదండ్రులవద్దకు వెళ్ళి రాళ్ళ పిల్లలందరినీ తనవద్దకు చదువు నేర్చుకోడానికి పంపమన్నది. తాను వాళ్ళకందరికీ ఉచితంగా విద్య నేర్పిస్తానన్నది. విద్య నేర్చుకోవటం వల్ల ఫలితాలను, లాభాలను ఎంతో విపులంగా వాళ్ళందరికీ వివరించింది. వాళ్ళుకూడా తమ బీదరికం, అజ్ఞానం, అంధకారం తొలగిపోవాలంటే తాము విద్యావంతులు కావడమే ముఖ్య కర్తవ్యమని భావించారు. తమ పిల్లలందరినీ తెరీసా వద్దకు పంపించడానికి అంగీకరించారు. ఆమె తమపిల్లలకు చేస్తున్న సహాయాన్ని ఎంతో అభినందించారు. చందాలు ఇచ్చారు. దానితో పాఠశాల నిర్వహణకు అవసరమయిన నల్లబల్లలు, చాక్‌పీసులు అన్నీ సేకరించారు. పాఠశాల చాలా నిరంతరాయంగా సాగుతున్నది. అక్కడిపిల్లలు పాఠశాల అయిపోయిన తరువాత తెరీసాతో "అమ్మా! మేము మరలా రేపువస్తాము" అంటూ ఆనందంగా కేరింతలుకొడుతూ వెళ్ళిపోయేవారు. తెరీసా "తప్పకుండా రమ్మని" వాళ్ళని పంపివేసేది. యీ సంఘటన అప్పటివరకు "సిస్టర్ తెరీసా"గా వున్న ఆమెను 'మదర్ తెరీసా'గా మార్చివేసింది. ఆ విధంగా ఆమె తల్లిలా సాకేది. అప్పటినుండి ఆమె పేరు "మదర్ తెరీసా"గా శాశ్వతమైపోయింది.

కొన్ని నెలలలోనే మదర్‌వద్ద పూర్వం సెయింట్ మేరీస్ పాఠశాల్లో చదివిన పాతవిద్యార్థులు మదర్‌తో కలసి సేవ చెయ్యడానికి ముందుకివచ్చారు. వాళ్ళుకూడా తమ ఖరీదయిన జీవనాన్ని వదలిపెట్టి మదర్‌వలె తెల్లటి చీరలుకట్టి పాఠశాల్లో ఉపాధ్యాయులుగా వుండేవారు. కొంతకాలానికి ఆ పాఠశాలకు వాళ్ళు చిన్న చిన్న గుడిసెలు వంటివి అద్దెకు దీసుకుని ఆశ్రయాన్ని కల్పించారు. దీనితో ఎట్టి వాతావరణ పరిస్థితులలోకూడా పాఠశాలను నిరంతరాయంగా నడుపుటకు అవకాశం లభించింది.

మదర్ పిల్లలను మధ్యాహ్నంపూట భోజనానికి వదిలేది. తిరిగి మరలా భోజనాంతరం పిల్లలు పాఠశాలకు వచ్చేవారు. మదర్ వాళ్ళను 'భోజనంచేశారా!' అని ప్రశ్నించేది. కానీ వాళ్ళనుండి మౌనమే సమాధానంగా వచ్చేది. వాళ్ళకు ప్రతిరోజూ తప్పకుండా భోజనం చెయ్యడం తెలియదు. ఇంట్లో వుంటే తినడం లేకపోతే ఆకలి వేసినపుడు నీళ్ళుత్రాగి కడుపు నింపుకోవటం మాత్రమే వాళ్ళకు తెలుసు. మదర్ వాళ్ళ దయనీయ పరిస్థితిని చూచి ద్రవించిపోయింది. వాళ్ళ అందరికి తినడానికి ఏదయినా ఏర్పాటు చేయాలనుకుంది. కొంత కాలానికే వాళ్ళకు మధ్యాహ్నంపూట గ్లాసుడు పాలు, రొట్టే యిచ్చే ఏర్పాటు చేసింది.

అంతేకాదు వాళ్ళకు రోగనివారణకు చర్యలు తీసుకున్నది. వాళ్ళు అసలు వుంటున్నదే మురికివాడలలో. అచ్చటి వాతావరణ పరిస్థితులే చాలావరకు దుమ్ము, ధూళితో నిండి వుంటాయి. దానికితోడు ఏ అభమూ ఎరగని ఆ పసి పిల్లలు మురికి కాలువలు, చెరువులప్రక్క ఆటలాడుతూ వుంటారు. వారికి శరీర

శుభ్రత గూర్చి అంతగా తెలియదు. మదర్ వాళ్ళకు శరీరాన్ని ఎంతో శుభ్రంగా ఉంచుకోవలసిన ఆవశ్యకతనుగూర్చి అర్థమయ్యేటట్లు నచ్చచెప్పింది. వాళ్ళకు అప్పుడప్పుడూ సబ్బులు అవీ ఇస్తూ వాళ్ళ శరీర శుభ్రతగూర్చి శ్రద్ధ తీసుకునే




పేద ప్రజలకు సరియైన మందులు లేవని వారికి మందులు ఉచితంగా యివ్వమని మేనేజర్ని ప్రాధేయపడింది.

టట్లు చేసింది, అంతేకాదు వాళ్ళకు అప్పుడప్పుడు వచ్చే జబ్బులకు అవసరమైన మందులు కూడా సమకూర్చాలనుకుంది,

అందుకోసం మదర్ ఒకనాడు ఒక మందులకంపెనీకి వెళ్ళింది. పేదప్రజలు అనేకమంది వైద్యసదుపాయాలులేక ప్రతిదినం మరణిస్తున్నారని తెలిపింది. వారికి అవసరమయిన మందులు తాను ఇస్తానని. అందుకోసం తనకు సహాయంగా మందులు ఇవ్వమని ఆ మేనేజరును వేడుకొంది. అందుకు అతడు డబ్బులేకుండా తానేమీ మందులు ఈయనని నిర్ద్వంద్వముగా తేల్చిచెప్పేశాడు. దీనితో మదర్ చాలా బాధపడింది. పేదప్రజలకు వైద్యసహాయం కల్పించడానికి ఏమి చేయాలా? అని భగవంతుని ప్రార్థించుకుంటూ సాయంకోసం భగవంతుని వేడుకుంటూ ఆ కంపెనీని విడిచి బయటకు వచ్చింది.

కానీ కొంతసేపటికి ఆ కంపెనీ మేనేజరులో పరివర్తన కలిగింది. మదర్ పేదప్రజలకొరకై నిస్వార్ధంగా సేవచేస్తూ వారికోసం మందులనిమ్మంటే తాను నిరాకరించడం ఏమీ బాగోలేదనిపించింది. వెంటనే అతడు మదర్‌ను సమీపించి "మదర్! మీరు పేదప్రజలకోసం ఎంతో నిస్వార్థంగా సేవచేస్తున్నారు. ఆ సేవలో భాగంగా మీరు నన్ను మందులడిగితే నేను నిరాకరించాను. అందుకు నన్ను క్షమించండి. ఇకనుంచి మీకు కావలసినన్ని మందులు స్వేచ్ఛగా ఉచితంగా తీసుకొని వెళ్ళవచ్చుని" తెలియజేసాడు. మదర్ ఎంతో ఆనందించి భగవంతునికి మనస్సులోనే కృతజ్ఞతలు తెలుపుకుంది.

1949వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో మదర్ తనతోపాటు కొంత మంది సేవికలుకూడా ఉంటే బాగుండునని భావించింది. ఆ సమయంలోనే మైఖేల్

గోమ్స్ అన్నవ్యక్తి మదర్‌వద్దకువచ్చి "మదర్! నాకు క్రీక్‌లేన్‌లో ఒక ఇల్లు ఉన్నది. అందులో రెండవ అంతస్తు కాళీగా వున్నది. మీ సేవా కార్యక్రమాలకు ఆ భవనాన్ని ఎందుకు వాడుకోరాదు?" అని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

మదర్ అతనికోరిక మన్నించి ఆ భవనాన్ని తన సేవా కార్య క్రమాలకు వినియోగించుకోవాలనుకున్నది. మదర్ ఆ గదిలో చేరింది. ఆమెతో పాటుగా చారూమా అన్న వేరొక స్త్రీగూడా ప్రవేశించింది. మదర్ "లొరెట్టో కాన్వెంట్" పాఠశాలలో పనిచేసేటపుడు చారూమా ఆమెకు వంటచేసి పెట్టేది. మదర్ అంటే చారామాకు ఎంతో పంచప్రాణాలు. మదర్ కార్యక్రమాల్లో చారూమా చేదోడు వాదోడుగా వుండేది.

మదర్‌థెరిసా ఉదయాన్నే నాలుగున్నరకల్లా లేచి ఆరు గంటలవరకు ధ్యానం, ప్రార్ధన, ఉదయపు భోజనం ముగించుకొని పాఠశాలకు వెళ్లేది. పిల్లలను పరామర్శించి విద్యాబోధన చెసేది. అక్కడినుండి దగ్గరలోని మురికి వాడలకు వెళ్ళి నిరుపేదలను, అభాగ్యులను పరామర్శించి తగిన సేవలు చెయటం ఆమె దినచర్య. ఈ కార్యభారం తలకుమించినపని అయ్యింది. అసాధ్యమనిపిం చింది. దేవుణ్ణి సాయానికై అర్ధించింది. నెలరోజుల్లోనే...

1949 మార్చినెలలో మరో బెంగాలీస్త్రీ ఆమెకు ఆశ్రయమయిన ఆ మేడగదికి వచ్చింది. ఆమెపేరు సుభాషిణీదాస్. తనను సేవికలా స్వీకరింపుమని ప్రార్ధించింది.

ఆమె ప్రార్థన విన్న మదర్ ఆలోచించి "ఈ సేవాకార్యక్రమం అతి కష్టమయినది. కఠోరమయిన ఈ పద్ధతికి సిద్ధపడి తరువాత బాధపడటం లాభం



థెరిసా నడుపుతున్న సేవా కార్యక్రమంలో తానూ వచ్చి చేరుతానని
మొట్టమొదటిగా తన ఉద్దేశ్యాన్ని తెలిపిన మహిళ సుభాషిణీదాస్

లేదు" అన్నది. సుభాషిణిదాస్ "అన్నిటికీ సిద్ధమే" అన్నది. తనపేరు అగ్నస్‌గా మార్చుకుంది. మదర్ థెరిసా కార్యక్రమాలను నడిపించటంలో అగ్నస్ ప్రథము రాలు. ఆ తరువాత మరో ముగ్గురు వాళ్ళతో కలసి పనిచేసారు. వీళ్ళంతా పేద

వాళ్ళ సేవలకోసం తమ జీవితాలను అంకితం చేసినవాళ్ళే. కొంత కాలానికి వీళ్ళ సంఖ్య పన్నెండుకు చేరుకొంది. వీళ్ళంతా గోమ్స్‌గారిమేడపై భాగంలో నివసిస్తూ కలకత్తా నగరంలో సేవాకార్యక్రమాలు నడిపేవారు. దీనితో మదర్ థెరిసా "నికృష్ట జీవనుల మాత"గా ప్రసిద్ధి చెందింది.

మదర్ కార్యక్రమాలు ఎంతోమంది సేవికలను ఆకర్షించాయి. అనేక మంది మదర్‌తో కలసి సేవ చేయటానికి ముందుకు వచ్చారు. మదర్ సేవాకార్యక్రమాలుకూడా దేశమంతటా మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నాయి. ఇందుకు ఒక నిర్దుష్టమయిన క్రమము. పద్ధతి లేదా నియమావళి అవసరమనిపించింది మదర్ థెరిసాకు. ఈ ఉద్దేశ్యంతో థెరిసా ఒక కార్యక్రమాన్ని, చట్టాన్ని నియమావళిని సిద్ధం చేసింది. దానిని ఆమూలాగ్రమూ నిశితంగా పరిశీలించింది. దానికి "మిషనరీస్ ఆఫ్ ఛారిటీ" అని పేరు పెట్టింది. ఇక నుండి తానుచేసే సేవా కార్యక్రమాలు ఆ సంస్థపేరుమీదే నడుపబడాలని భావించింది. దానినే "త్యాగమయ ప్రేమజీవనులు" అనికూడా అనేవారు. ఈ నియమావళిని రోము పట్టణంలోని పోపు ఆమోదానికి పంపింది.

ఈ చట్టం 1950వ సంవత్సరం అక్టోబరు నెలలో పోపుచే ఆమోదింపబడి కలకత్తా నగరంలో ఫాదర్ వేన్ ఎక్సెంకు పంపబడింది. ఫాదర్ వేన్ ఎక్సెం ఆ ఆమోదపత్రాన్ని మదర్ ఉన్న మేడగదిలో ఆమె ప్రార్థనానంతరం చదివి వినిపించి ఆమెకు అందజేశాడు.

పోప్ ఆమోదాన్ని పొందిన "మిషనరీస్ ఆఫ్ ఛారిటీ" చట్టాన్ని అనుసరించి ప్రపంచంలోని 71 దేశాల్లో మదర్ సేవాకార్యక్రమాలు విస్తరించాయి.

దీనితో మదర్‌తో కలసి పనిచేసే సేవకుల సంఖ్య విస్తారంగా పెరిగిపోయింది. దానితో గోమ్స్‌గారిమేడ ఆమె కార్యక్రమాలకు సరిపోవడంలేదు. దానితో మదర్ ఫాదర్ వేన్‌ఎక్సెంతో చర్చించి ఆయన సాయంతో మూడంతస్తుల విశాలమయిన మేడను సంపాదించింది. ఇది కలకత్తాలోని 54 ఎ లోయర్ సర్క్యులర్ రోడ్‌లో వున్నది. అప్పటినుండి ఇప్పటికీ అదే "మిషనరీస్ ఆఫ్ ఛారిటీ"కి ముఖ్యకేంద్రమయి దేశవిదేశాలలోని సేవాకార్యక్రమాలను స్థానంగా తయారయ్యింది. అప్పటినుండి ఈనాటికీ అదియే మదర్ నివాసస్థలము. మదర్ ఆ మేడలో క్రొత్తగా వచ్చే సేవికులకు, వైద్యవిద్యలలో, సేవా విషయంలో తర్ఫీదునుఇచ్చి ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో తాను స్థాపించిన సేవాకార్య క్రమాలలో భాగమయిన అన్నదాన సత్రాలలో, వివిధ ఆసుపత్రులలో కుష్ఠు వ్యాధి నివారణాలయాలలో నియమించేది. మదర్ చేసే కార్యకలాపాలన్నింటికీ ఈ "మిషనరీస్ ఆఫ్ ఛారిటీ"కి ముఖ్యకేంద్రమయిన ఈ మేడ ప్రపంచఖ్యాతి పొందింది. ఈ విధంగా థెరీసా సేవాకార్యక్రమాలు ప్రపంచమంతటా శాఖోప శాఖలుగా విస్తరించాయి. అనేకమంది సేవికలు చేరారు. ఇంకెంతమంది వస్తారో! అనేక సేవాకార్యక్రమాలు ప్రారంభించింది. ఇంకెన్ని కార్యక్రమాలు ప్రారంభిస్తుందో? ఊహించనలవి కాకుండా పోయింది.

1952 సంవత్సరంలో థెరీసా ఒకనాడు కలకత్తా వీధులలో వెళుతూ ఉండగా దారిలో ఒకస్త్రీ పడిపోయి ఉండడాన్ని గమనించింది. ఆమె ఏదోజబ్బుతో బాధపడుతున్నది. ఎంతో పేదదానివలె వున్నది. ఓపికలేక కదలలేక పోతున్నది. కాసేపటిలో ప్రాణాలు పోయేస్థితిలో వున్నది. కొనవూపిరితో వూగిసలాడుతున్నది.

కొనప్రాణంతో ఉన్న ఆ స్త్రీ నిస్సత్తువతో రోడ్డుపై పడియున్నది. ఎలుకల చీమలు అప్పుడే ఆమె శరీరాన్ని కబళించివేస్తున్నాయి. వానినికూడా అదిలించలే



1952వ సంవత్సరం ఒకనాడు కలకత్తా వీధుల్లో థెరిసా వెళుతుండగా దారిలో రోడ్డు ప్రక్కగా ఒక స్త్రీ పడి ఉండడాన్ని గమనించింది.

ఆ స్త్రీ ఆ భయంకరమైన బాధను ఓర్చుకోలేక, అరవడానికికూడా ఓపిక లేకుండా ఉన్నది. అట్టి దీన స్థితిలో మురికిలో వున్న ఆ స్త్రీని చూడగానే మదర్ మనస్సు చివుక్కుమన్నది. గుండెలో ఎంతో బాధ ఒక్కసారిగా కళుక్కుమన్నది.

వెంటనే ఆ స్త్రీని తీసికొని నెమ్మదిగా దగ్గరలోనున్న ఆసుపత్రికి తీసుకొని వెళ్ళింది.

అదేవిధంగా ఒకనాడు తన తల్లియైన ద్రోండాకూడా తన చిన్నతనంతో ఒక స్త్రీని ఆదరించిన విషయం జ్ఞాపకమొచ్చింది. ఈనాడు మదర్ చావు బ్రతుకుల మధ్యనున్న ఒక పేద భారత స్త్రీని ఆసుపత్రికి తీసుకొని వెళ్ళింది. అక్కడి వైద్యులకు విషయం తెలియజేసి ఆమెకు తక్షణ వైద్యం చేయవలసిందిగా వేడుకొంది. కానీ అక్కడి వైద్యులు డబ్బు లేకుండా వైద్యం చేయడానికి ససేమిరా ఒప్పుకోలేదు.

"నీవద్ద డబ్బులేకుంటే మేము ఉచితంగా వైద్యం చెయ్యలేము. నీవు ఆ స్త్రీని ఈ ఆసుపత్రిలో చేర్చవద్దు. తీసుకొనిపో" అని వాళ్ళు నిరాకరిస్తే మదర్ పట్టుబట్టింది. "చావు బ్రతుకుల మధ్యనున్న ఒక పేదస్త్రీకి వైద్యం అందించుట ముందా? లేక డబ్బు ముందా! మీరామెకు తప్పనిసరిగా వైద్యం చేయాలి" అని పట్టుబట్టి చివరికి తన పంతాన్ని నెగ్గించుకొని ఆ ఆసుపత్రిలో చేర్చింది. చివరికా వైద్యులు దిగివచ్చి ఆ స్త్రీని తమ ఆసుపత్రిలో చేర్చుకోవడానికి అంగీకరించారు. కానీ మదర్ మందులు తీసుకొని వచ్చేసరికి ఆ స్త్రీ మరణించింది. దానితో మదర్ ఎంతో దిగులుచెందింది. బాధపడింది. కానీ అంతటితో ఊరుకోలేదు.

అక్కడినుండి సరాసరిన "కలకత్తా హెల్తు డిపార్టుమెంట్"కి వెళ్ళింది. అక్కడ జరిగిన సంఘటన మొత్తాన్ని వివరంగా తెలియజేసింది. అదే విధంగా ప్రతిరోజు అనేకమంది పేదప్రజలు రోడ్లపై. వీధులలో మరణిస్తున్నారని, వాళ్ళ

గూర్చి తగినచర్య తీసుకొని ఏమైనా ఏర్పాట్లు చేయమని వేడుకొంది. డాక్టరు అహ్మద్ అన్నవ్యక్తి అప్పుడు హెల్తు డిపార్టుమెంట్ అధిపతిగా వుండేవాడు. అతడు అంతా విని "అయామ్‌సారీ. మేము చేయడానికి ఇంకేమీలేదు" అని పలుకగా మదర్ "కానీ నాకు చేతనయినంత సాయం అందిస్తాను. వారికి నా సేవలు చేస్తాను. బ్రతికి ఉండి అంతిమదశలో వారు ప్రాణాలను స్వేచ్ఛగా విడిచిపెట్ట డానికి అవకాశం నేను కల్పిస్తాను. కొనప్రాణంతో వుండికూడా అప్పుడే ఎలుకల కబళింపుకు గురైనది అంటే అది మానవజాతికే అవమానం. వారికి ఆశ్రయం కల్పించడానికి, సేవలు చెయ్యడానికి నాకు ఏదయినా భవనాన్ని ఇప్పించండి.ఎంతో మంది బీదాబిక్కా ప్రజలు తమ అంతిమ ఘడియలు ఆనందంగా గడుపుతూ తమ ప్రాణాలు స్వేచ్ఛగా వదిలే ఏర్పాట్లు నేను చేస్తాను. రోడ్లపై. వీధులలో మర ణించిన వారి శవాలను సేకరించి భద్రపరచి మునిసిపాలిటీవారికి అప్పగించి వారికి అవసరమైన దహన సంస్కారాలు నిర్వహిస్తాను" అని వేడుకొంది.

మదర్ మాటలు ఆ అధికారిమనస్సులో ములుకుల్లాగ్రుచ్చుకున్నాయి. అతని మనస్సు కరిగిపోయింది. వెంటనే అతడు కాలీఘాట్‌లోని కాళీ ఆలయం సమీపంలో ఉన్న ఒక సత్రాన్ని ఆమె సేవాకార్యక్రమాలను వాడుకొనుటకు వీలుగా అనుమతి మంజూరు చేసాడు. మదర్ ఆనందంతో ఆ భవనాన్ని స్వీక రించింది.

మదర్ ఆ భవనంలో మరణావస్థలోనున్న వారికి తమ అంతిమ ఘడి యలు ఆనందంగా, తమను ఆరాధించే వారిమధ్య గడిపే ఏర్పాట్లుచేసింది. కేవలం ఇరవై నాలుగు గంటలలోనే థెరీసా. ఆమె తోటి సేవికలు ఆ భవనానికి కలకత్తా

వీధులలోని శవాలను, రోగులను తరలించటం మొదలుపెట్టారు. వారందరికీ ఆ భవనంలో ఆశ్రయం కల్పించబడింది. వారిలో ఎంతోమంది చనిపోవడానికి సిద్ధంగా వున్నారు.

వారందరికీ స్వేచ్ఛగా, హాయిగా తుదీ వూపిరి పీల్చుకునే అవకాశం థెరీసా ఈవిధంగా కలుగజేసింది. వారిలో మరణించిన వారిని భద్రపరచి కలకత్తా లోని మునిసిపాలిటీ వారికి అప్పగించి దహన సంస్కారాలు జరిపించేది. దీనం తటికీ థెరిసా "నిర్మల హృదయ్" అని నామకరణం చేసింది. ఆ తరువాత నిర్మలహృదయ్ యొక్క శాఖలు దేశమంతటా విస్తారంగా వ్యాపించి, ముసలి వాళ్ళకు, ఆఖరి ఘడియలలో వున్నవారికి, రోగపీడిత జనులకు ఎంతో ఉపక రించాయి. ఉపకరిస్తున్నాయి కూడా. ఈ విధంగా వారందరినీ మదర్ ఎంతో ప్రేమతో సాకుతూ వుండేది.

కాని ఇది అక్కడి ప్రజలకు ఇష్టంకాలేదు. దీనికొక కారణం వుంది. మదర్ స్థాపించిన "నిర్మల్ హృదయ్"కు సమీపంలోనే ఎంతో పురాతనమైన ఎంతో ప్రసిద్ధిచెందిన కాళీమాత ఆలయం వుంది. దానినే కాలిఘాట్ అనేవారు. అక్కడ అనేక దుకాణాలు, ప్రజలతో ఆ ప్రదేశం అంతా ఎంతో జనసమ్మర్ధంగా వుండేది. అక్కడికి వచ్చే యాత్రికుల సంఖ్య కూడా ఎక్కువే. వారికోసం కేటా యించిన సత్రాన్ని మదర్ యొక్క "నిరల హృదయ్"కి తరలించడం వారికి ఇష్టంలేదు. అందునా ఒక హిందూ స్థలాలను ఒక క్రిష్టియన్‌కి అప్పగించడం, అంతేకాక ఆ భవనంలో శవాలను భద్రపరచడం, రోగపీడిత ప్రజలను ఉంచడం వారికి అసంతృప్తి కలిగించింది. ఎలాగయినా "నిర్మల హృదయ్"ని

అక్కడినుండి తొలగించాలని వారు పట్టుదలతో వున్నారు. కాళీమాత ఆల ప్రాంతాలు అపవిత్రమైనట్లు వారు భావించారు. హిందువులకు చెందిన ఆ స్థ క్రిస్టియన్‌లకు ఇవ్వరాదని నిర్ణయించారు.

మతపరమైన విషయాలతో వారందరూ అక్కడి రాజకీయ పెద్దల కార్పొరేషన్ పెద్దలను సమీకరించి ఒక సభను ఏర్పాటుచేసారు. అందులోపాల్గొన వారందరూ "నిర్మల హృదయ్" అక్కడ ఉండటం ద్వారా ఆలయ పవిత్రత భంగం చేకూరుతుందని నిర్ణయించారు. చివరకు అక్కడినుండి దానినితొలగించాల పట్టుబట్టారు. వారిలో కొంచెము పేరున్న ఒక రాజకీయ నాయకుడు మదర్ యెలాగయినా పట్టుకొని బయటకు ఈడ్చుకొని వస్తానని "నిర్మల హృదయ్ లోనికి అడుగుపెట్టాడు.

అడుగు పెట్టడంతోనే లోపల థెరిసా, ఆమె సేవికలు చేస్తున్న పను చూసాడు. వారు రోగ పీడితులకు కట్లు కడుతున్నారు. ముసలివాళ్ళకు స్నానా చేయిస్తున్నారు. వారికి భోజనం మొదలయినవి తినిపిస్తున్నారు. అవసరమై మందులు వారిచేత క్రైము ప్రకారం మింగిస్తున్నారు. ఈ విధంగా వారికి వున్న అశౌకర్యాన్ని తొలగించడానికి అవసరమైన అన్ని పనులూ యెంతోఆప్యాయంగా ప్రేమగా చెస్తున్నారు. ఆ దృశ్యాలన్నీ తిలకించిన ఆ రాజకీయ నాయకునిలో పరివర్తన కలిగింది. అతని మనస్సు ఎంతో బాధపడింది. థెరిసా చెస్తున్న సే లకు అతడు ఎంతో ఆనందపడ్డాడు.

వెంటనే బయటకు వచ్చి అక్కడున్న వారితో మదర్ నిర్మల హృదయ్‌లో చేస్తున్న సేవలు మనతల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, మన బంధుమిత్రులు యెవ్వరూ చెయ్యనంతటి గొప్పవని పొగిడాడు. అక్కడి



ఒక రాజకీయ నాయకుడు థెరీసా సేవలు గమనించి తన మనస్సు మార్చుకుని ఆమెతో సహకరించాడు.

కాళీమాత ఆలయంలో వున్నది కేవలం ఒక రాతి విగ్రహం మాత్రమేనని ఆ సత్రంలో వున్న మదరే నిజమైన దేవత అని, ఆమెను అక్కడినుండి తొలగించ

చం కాకుండా ఆమె చేస్తున్న సేవలను ప్రోత్సహిస్తూ, ఆ సేవలో పాలు పంచు కుంటూ చేతనైన సాయం చేయవలసిందిగా అక్కడి వారందరికీ బోధించాడు.

దానితో అనేకమంది భారతీయులకు థెరీసాపై నమ్మకం కలిగింది. అనేకమంది భారతీయులు మదర్ సేవలో పాలు పంచుకోవడానికి ముందుకువచ్చారు వాళ్ళే స్వయంగా కలకత్తా వీధులలో రోడ్ల వెంబడి, వీధుల వెంబడి తిరుగుతూ మర ణానికి సిద్ధంగావున్న ముసలివారిని, మరణించిన వారి శవాలను, రోగులను నిర్మల హృదయ్‌కు తీసుకునిరావడం మొదలుపెట్టారు. వారు తెచ్చే వారిలో ఇంకొన్ని నిము షములలో చనిపోయే వారితోసహా అందరినీ మదర్ తన నిర్మలహృదయ్‌లోనికి ఆహ్వానించేది. అందులో మదర్, ఆమె సేవికలు వారికి ప్రేమానురాగాలను ఇస్తూ అన్ని సపర్యలు చేసేవారు.

థెరీసాని ఆశ్రయించి వచ్చేవారి సంఖ్యకూడా రోజురోజుకు మరింత పెరగసాగింది. దీనితో నిర్మలహృదయ్ భవనాలను మరికొంత విస్తరించారు. అదే "మదర్ హౌస్"గా పేరుగాంచి థెరీసాకు నివాసస్థలము, ఆమె సేవాకార్యక్రమా లకు ముఖ్యకేంద్రము అయ్యింది.

ఆ రోజుల్లో భారతదేశంలో కుష్ఠువ్యాధి ఒక భయంకరమైనమహమ్మా రిలా వ్యాపించింది. అనేక వేలమంది ప్రజలు ఆ కుష్ఠువ్యాధికి గురయ్యారు. వీరిలో ధనికులూ, పేదవారూ, హిందువులూ, ముస్లింలూ, క్రిస్టియన్లు అన్ని మతాలవారూ

జాతులవారూ వున్నారు. ఒకనాడు తెరీసా నిర్మలహృదయ్‌లోని తనగదిలో ఉండగా తలుపు చప్పుడయి, తలుపు తెరిచిచూడగా అనేకమంది కుష్ఠువ్యాధి రోగులు వాకిట నిలిచి వున్నారు. వారు తెరీసాతో "అమ్మా! ఈ వ్యాధి మూలంగా మేం ఉద్యోగాలు కోల్పోయాము. మాకు ప్రస్తుతం నిలువనీడలేదు. సంఘంలో మమ్మల్ని ఆదరించే వారేలేరు. ఎక్కడికి వెళ్ళాలో కూడా తెలియడంలేదు. మమ్మల్నికూడా ఆదరించి నీవేదారిచూపు తల్లీ!" అని వేడుకున్నారు.

థెరీసా వారినికూడా తన నిర్మలహృదయ్‌లోకి సాదరంగా ఆహ్వానించింది. వారికికూడా సేవలందించింది. కుష్టురోగము ఆ రోజులలో భయంకరమైన వ్యాధిగా పరిగణింపబడేది. ఆ వ్యాధికి గురైనవారిని సమాజం చిన్నచూపుచూసేది. కలకతాలోని మురికివాడలలో అనేకమంది ఆ వ్యాధికిగురై ఇతరుల ఆదరణకు, ఆశ్రమానికి నోచుకోక దుర్భరయాతనలను అనుభవిస్తున్న వారిని తెరీసాచూచింది వారి పరిస్థితికి జాలిపడి వారికొక పునరావాస కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. దాని పర్యవసానమే ఆమె స్థాపించిన శాంతినగర్, ఈ సంస్థ మొట్టమొదట 1957లో కలకత్త శివార్లలో వున్న "గోబ్రా" ప్రాంతంలో స్థాపించబడింది. అందులో సేవికలు రోగులకు ఎన్నో సేవలుచేయాలి. కట్లుకట్టాలి. ఇంజక్షన్లు చేయాలి, బోజనం పెట్టాలి. అవసరమైతే తినిపించాలికూడా. అందుకే తెరీసా తన సేవికలందరికి ఇంజెక్షన్లు, మందులు ఇవ్వడంలో తర్ఫీదు ఇప్పించింది. కుష్ఠు

వ్యాధికి సంబంధించిన మందులు విదేశాలలో తయారవుతున్నాయని విని మదర్ వాటిని విదేశాలనుండి దిగుమతి చేసుకుని కుష్టువ్యాధిని అరికట్టడానికి అన్ని చర్యలు తీసుకున్నది.

కొంతకాలానికే కుష్టువ్యాధి నివారణలో నిష్ణాతుడైన ఒక భారతీయ వైద్యుడు తెరీసాతో కలిసి సేవలు చేయడానికి ముందుకువచ్చాడు. అతడు మదర్ సేవికలకు కుష్టువ్యాధికి సంబంధించి అవసరమైన వైద్యవిధానంలో తర్ఫీదు ఇచ్చాడు. క్రొత్తమందులు, నూతనవిధానాలతో ఆ వ్యాధిని అదుపులోనికి తీసుకొని వచ్చాడు. తెరీసా తన పూర్తి కాలాన్ని ఆ కుష్టువ్యాధి నిర్మూలనకే కేటాయించింది.

కలకత్తాలోని మురికివాడలలో 30,000 మందికిపైగా కుష్టువ్యాధి గ్రస్తులు ఉన్నారని విన్నది. కానీ తాను సేవలు చేయుచున్నది కేవలం 1000 మందికి మాత్రమే, అందుకే తర్ఫీదు పొందిన సేవికలతో మరిన్ని కుష్టువ్యాధి నివారణాలయాలను స్థాపించాలని నిర్ణయించింది. కానీ ఆరంభంలో ఎన్నో అడ్డంకులు ఎదుర్కొన్నది.

థెరీసా, ఆమె సేవిక ఒక ఆమె కలసి కుష్టువ్యాధి నివారణాలయాలను స్థాపించడానికి అనువైన స్థలాన్ని సేకరించడానికి బయలుదేరారు. వారు ఒకచోట స్థలాన్ని చూసి “ఇది ఎంతో అనువైన ప్రదేశం. ఇక్కడ ఒక మంచి కుష్టు

వ్యాధి నివారణాలయాన్ని అన్ని సౌకర్యాలతో నిర్మించవచ్చు" అనుకున్నారు. అది విన్న అక్కడి ప్రజలు అడ్డుతగిలారు. అక్కడి సర్పంచ్‌కి తెలియజేసారు.



మదర్ థెరీసా ఒక సేవికలతో కుష్ఠువ్యాధి నివారణకు ఒక కుటీరాన్ని నిర్మించాలన్న సంకల్పంతో ఒక ప్రాంతాన్ని నిర్ణయించంగా ఆ ప్రాంతపు ప్రజలు ఆమెపై రాళ్ళురువ్వారు.

అతడుకూడా అందుకు అభ్యంతరం తెలియజేశాడు. అక్కడి ప్రజలు "ఇక్కడ కుష్టువ్యాధి నివారణాలయాన్ని స్థాపించి, కుష్ఠురోగులను ఇక్కడకు తీసుకుని

వస్తారా?" అంటూ మదర్‌పై విరుచుకుపడ్డారు. వారిలో కొందరు మదర్‌పై రాళ్ళుకూడా రువ్వారు.

అయినా మదర్ బాధపడలేదు. తన కార్యక్రమ పద్ధతిని మార్చి సంచార వైద్యశాలలు స్థాపించి వారికి సేవ చేయాలనుకుంది. అందుకోసం చందాలు, విరాళాల రూపంలో నిధులు సమకూర్చుకున్నారు. ఆ ధనంతో అవసరమైన మందులు, ఇంజెక్షన్లు మొదలైన సామాన్లు కొన్నారు. "యు. యస్. కాథలిక్ రిలీఫ్ సర్వీస్" అను సంస్థవారు మదర్‌కు ఒక సంచారవాహనాన్ని సమకూర్చారు. దానిద్వారా మదర్ మారుమూల ప్రాంతాలకు కూడా వెళ్ళి కుష్టు వ్యాధి గ్రస్తులకు ఇంజెక్షన్లు, మందులు ఇచ్చేవారు. ప్రారంభదశలో ఈ వ్యాధి ఉన్నవారికి ఇది ఎంతో ఉపయోగపడింది. వారందరూ ఈ రోగం నుండి విముక్తి పొందారు. కొంతకాలానికే ఆ సంచార వాహనాల సంఖ్య పదికి చేరుకుంది. వాటిద్వారా ఆమె సేవికలు మారుమూల ప్రాంతాలకు సైతం వెళ్ళి సహాయం చేస్తుండేవారు. వారందరికీ "గోబ్రా"లోని శాంతినగర్ భవనం ముఖ్య కేంద్రంగా వుండేది.

కలకత్తా నగరపాలక సంస్థలో పనిచేసే ఒక అధికారికి ఈ భయంకర వ్యాధి సోకుటవల్ల భార్యాపిల్లలకు దూరమయి మదర్‌ను ఆశ్రయించాడు. ఈ సంస్థలో వైద్యంపొందిన ఈ అధికారి అనతి కాలంలోనే స్వస్థతను పొందాడు. అతడానాటినుండి ఈ సంస్థ వ్యవహారాలలో మదర్‌కు చేదోడువాదోడుగా వుంటు

న్నాడు. ఈ సేవా కార్యక్రమాలవల్ల ఎందరో రోగులు వైద్యం పొంది. స్వస్థా నాలకుకూడా వెళ్లేవారు.

ఇంతలో ప్రభుత్వం కలకత్తా నగర విస్తరణ కార్యక్రమం చేపట్టింది. దీనివల్ల "గోబ్రా"లోని కుష్టురోగుల సేవా కేంద్రాన్ని వేరేచోటికి తరలించవల సిందిగా ఆదేశాలివ్వబడ్డాయి. అప్పుడు మదర్ ఆగ్రహానికి అంతులేదు. ముఖ్య మంత్రిగారిని కలసి ప్రభుత్వ నిర్ణయం నిర్దయతో కూడిందని ఆ నిర్ణయాన్ని ప్రభుత్వం మార్చుకోవలసిందిగా విజ్ఞప్తి చేసింది. కానీ ముఖ్యమంత్రి డా॥ బి సి. రాయ్ కలకత్త నగర జనాభా పెరిగిపోవడంవల్ల నగరం విస్తరిత పరచవలసిన అవసరముందని కుష్టురోగుల ఆశ్రమానికై వేరొక ప్రదేశంలో అవసరమైనచోటు చూపుతామని తెలిపారు.

వెంటనే ఆ ముఖ్యమంత్రి ఆజ్ఞల అనుసారం మదర్‌కు "అసన్‌సోల్" సమీపంలో వున్న ముప్పైనాలుగు ఎకరాల స్థలం ఈ సంస్థకై కేటాయించబడ్డది. అక్కడ వెలసిన పునరావాస కేంద్రమే శాంతినగర్. ఇందులో నాలుగు వందల కుటుంబాలు నివసించే విధంగా రూపకల్పన చేయాలని మదర్ భావించింది. అంతే కాదు దానిని విలక్షణంగా నిర్వహించింది. చక్కటి ఇండ్లు, ఇండ్లకు పూల కుండీలు, కుషన్ కుర్చీలు మొదలైనవన్నీ ఏర్పాటు చేయించింది.

"రోగి ఇది తన నివాసస్థలంగా భావించాలి. ఇక్కడే జీవించాలి. ఇక్కడే పనిచేసి తన భుక్తిని సంపాదించాలి. ఇక్కడే మరణించాలి. వాళ్ళకు ఆహ్లాదాన్ని కలిగించేందుకు ఈ స్థలం అందంగాను, పరిశుభ్రంగాను ఉండాలి." అని మదర్ కోరుతూ ప్రయత్నం చేస్తూ వుంటుంది.

శాంతినగర్‌లో అనేక కుష్ఠురోగులు కుటుంబాలుగా జీవిస్తున్నారు. వారి పిల్లలకు ఈ కుష్ఠువ్యాధి రాకుండా అవసరమైన అన్ని జాగ్రత్తలూ మదర్, ఆమె సేవా సంఘం తీసుకుంటోంది. దీనివల్ల రాబోయే తరంవారు ఈ కుష్ఠు వ్యాధినుండి విముక్తి పొందే అవకాశం వుంది. "ధాపా" అనే ప్రదేశంలో మదర్ కుష్ఠువ్యాధిగ్రస్తులైన పిల్లలకోసం ఒక పాఠశాలను నిర్మించింది అందుకు అవసరమైన భవనాన్ని కూడా పూర్తిచేసింది. కానీ అనుమతి లేకుండా అక్కడ ఆ భవనం నిర్మించారని నగరపాలకసంస్థ వారు దాన్ని కూల్చి వేయదోగా అక్కడి ప్రజలందరూ ఏకమై వాళ్ళను అడ్డుకున్నారు. మదర్ సేవా కార్యక్రమాల విషయంలో ప్రజలలో వుండే ఆదరణాభిమానాలు ఆ విధంగా వుండేవి.

ప్రతిరోజూ సుమారు 15,000 మంది కుష్ఠురోగులు ఈ వైద్య సేవలను శాంతినగర్‌లో పొందుతున్నారు. అంతేకాదు సుమారు 3350 మంది అచ్చటనే నివశిస్తూ చికిత్సలు, సేవలు పొందుతున్నారు.

ఆ విధంగా రోగపీడితులకు సేవలు చేయటంతోనే మదర్ ఊరుకో లేదు. బీదరికంతో అలమటించే వారిని గూర్చి కూడా పట్టించుకున్నది. కలకత్తా నగరంలో ప్రజల జీవితాలు వింత వింతగా వుంటాయి. కొంతమంది పెద్ద పెద్ద మేడలలో ఆకాశ హర్మ్యాలలో నివశిస్తూ ఉంటే అనేకమంది బీదప్రజలు ఆ మేడల, భవనాల నీడలచాటున జీవిస్తుంటారు. మరికొందరు గొప్పగొప్ప విందుభోజనాలతో, విలసాలలో మునిగి తేలుతూ వుంటే అనేకమంది ప్రజలు ఆకలితో అలమటిస్తూ, పస్తులు ఉంటూ, ఉచితంగా లభించే గాలిని పీల్చుకుంటూ, నీటిని త్రాగుతూ జీవిస్తూ వుంటారు. ఈ విధమైన అసమానతలు మదర్ దృష్టిలో పడాయి. ఆ బీదవారికి జీవనోపాధికి ఏదైనా మార్గం చూపి వారికికూడా నాలుగు మెతుకులు తినే అవకాశం కల్పించాలని మదర్ భావించింది. వాళ్ళ జీవితాలలో కూడా వెలుగురేఖలు ప్రసరింపజేసి ఆనందాన్ని, ఉల్లాసాన్ని కల్పించాలనుకుంది.

కలకత్తలోని ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ నుండి మదర్‌కు ఒక విశాలమయిన భవనం లభించింది. అందులో ఆమె తలపెట్టిన పునరావాస కేంద్రాన్ని నెలకొల్పింది. ఇదియే "ప్రేమ్‌దాన్"గా పేరుగాంచింది. జీవనోపాధిని సంపాదించే మార్గాలు సూచించడం, మతి స్థిమితం లేనివాళ్ళకు వైద్యం చేయడం ఈ సంస్థ ముఖ్య విధులు. ఈ విధంగా మదర్ ఎంతోమంది నిరుద్యోగులకు, బీదవారికి జీవనోపాధి చూపించి వారి జీవితాలుకూడా బంగారు కాంతులతో కళకళ

లాడునట్లు చేసింది. అంతేకాదు. శాంతినగర్‌లో కూడా కుష్టువ్యాధి నుంచి చికిత్స పొంది రోగ విముక్తి కావించబడినవారికి జీవనోపాధిగా కుట్టుమిషన్, చేతిపనులు మొదలైనవి నేర్పించేది.

మదర్ నిర్మించిన మరొక బాలల పునరావాస కేంద్రంలో పిల్లలకు గోనెసంచులు, పట్టాలు. కాగితపు సంచులు, కొబ్బరినారతో తాళ్ళు, చాపలుతయారు చేయడం నేర్పింది. దానితో వాళ్ళు ఉన్ననాడు తినిలేనినాడు పస్తులుండే విధానానికి స్వస్తి చెప్పారు. మదర్ ఆదేశాలను అనుసరించి ప్రతిదినం కష్టించి అన్ని వస్తువులూ తయారుచేసి వాటిని అమ్మగా వచ్చిన ధనంతో హాయిగా జీవితాలను గడుపుతున్నారు.

ఈ విధంగా మదర్ స్థాపించిన మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ద్వారా జరిగే సేవలు దేశమంతటా వ్యాపించాయి. అన్ని ప్రాంతాల ప్రజలు దేశంలోని అన్ని ప్రదేశాల్లో మదర్ మిషనరీలు స్థాపించి సేవలు చేయాలనికోరారు. దానికి మదర్ దేశంలోని అభాగ్యులందరికీ సేవలందించడానికి మిషనరీలు స్థాపించడంతోనే సరి పోదని ప్రతీ ఒకవ్యక్తీ తనకి తానుగా ఇతరులకు సేవలు చేయడం అలవాటు చేసుకోవాలని బోధించింది.

మదర్ సేవాకార్యక్రమాలు ఎంతో విస్తరించాయి. మదర్ పేద వారికి, రోగగ్రస్తులకు, ముసలివాళ్ళకు మాత్రమే వైద్య రంగాలలో సేవలు

చేయడంతో ఆగలేదు. ఆమె బాలబాలికలైన అనాధలను, అన్నార్తులను విశేషంగా ఆదరించి సేవలు చేసింది.



దారిప్రక్కన చిన్నారి పాపకు రొట్టెను తినిపిస్తున్న మదర్ థెరీసా

ఒకనాడు ఒకపాప ఆకలితో అలమటిస్తుంది. పెద్దవాళ్ళెవరూ లేరు. ఆకలి బాధతో ఏడ్చి ఏడ్చి నీరసించి శక్తిలేక సొమ్మసిల్లి పడిపోయింది. ఆ

సంఘటన మదర్ కంటబడింది. వెంటనే ఆ పాపను సమీపించి తన బుట్టలోని రొట్టెముక్కను ఇచ్చి తినమని సైగ చేసింది. కానీ ఆ పాప దానిని తినకుండా దాచుకోవడానికి ప్రయత్నించింది. ఆ రొట్టెముక్క అయిపోతున్నట్లు మదర్ వంక ముఖం పెట్టింది. అది గమనించిన థెరీసా ఆ పాపను దగ్గరకు తీసుకొని ఆ రొట్టె ముక్కను తినిపించి, ఆ పాప ఆకలి తీర్చింది. ఇటువంటి పాపలు ఆ కలకత్త నగరంలో ఎంత మందో, ఇటువంటి నీచస్థితిలో వున్నవారు. తల్లి దండ్రులచే విడువడినవాళ్లు, చెత్తకుండీలో పారవేయబడిన వాళ్ళు, ఆసుపత్రిలో కని వదిలివేయబడిన అనాధలు ఎందరో. చిన్నపిల్లలు ఆ పసి వయస్సులో కేరింతలు కొడుతూ ఆడుకునే వయస్సులో ఆ విధంగా ఆకలి బాధకు గురవడం ఆమెను బాధించింది. కలకత్త నగరానికి ఈ పసిపిల్లల సమస్య ఒక పెద్ద విషమ సమస్యగా పరిణమించింది. "ఒక చిన్నారి చిరునవ్వులో, చిట్టితల్లుల ప్రేమామృతం నుంచి చిందిన ఆనందంలోనే నా సేవకు ప్రతిఫలాన్ని చూచుకొంటాను నేను" అని అన్నది మదర్.

ఈ మాటలు థెరీసాకు పిల్లలపై వున్న అనురాగాన్ని వ్యక్తం చేస్తాయి. అనాధలైన ఆ పిల్లలకోసం తెరీసా ఒక సంస్థను ఏర్పాటు చేసింది. అదియే "నిర్మలశిశుసదన్" ప్రారంభంలో అద్దె ఇంట్లో నడిచినప్పటికీ నేడు స్వంత భవనాన్ని సమకూర్చుకొని ఈ సంస్థ సేవలందిస్తున్నది. పిల్లల భోజన

వసతికై వంటగది, ఆరోగ్య సంరక్షణకు ఆసుపత్రి మరియు ఇతర సంరక్షణ బాధ్యతలు నిర్వహించుటకు కార్యాలయం కూడా ఈ భవనంలోనే వున్నాయి.

కలకత్తా నగరంలో తల్లిదండ్రులచే విడువబడినవారు, అనాధలు మున్నగు వారందరూ ఈ సంస్థలోనే పెంచి పెద్ద చేయబడతారు. నగరంలో రోడ్లపైన, చెత్తకుండీలవద్ద కని వదిలివేసిన పసిపిల్లలను వెంటనే "శిశుసదన్"కు పంపవలసిందిగా మదర్ కలకత్తా నగరమంతటా ప్రకటించింది. చిరునవ్వులు చిందించే ఆ చిన్నారులు మదర్ సేవికలనే తమ తల్లులుగా భావిస్తారు. వారి పెంపకంలో ఒక ఆవిటివాడు తప్పటడుగులు వేస్తాడు. ఒక అనాధ తాను అనాధను అన్న భావాన్ని దగ్గరకు రానీయడు. వారందరినీ ఆ విధంగా పెంచి పెద్దచేసి వారికి విద్యా సౌకర్యాలను కల్పిస్తారు. ఆ తరువాత వారికి జీవనోపాధిని చూపిస్తారు. యుక్తవయస్సురాగానే వారికి వివాహాలు కూడా జరిపిస్తారు. ఆ విధంగా ఆ సంస్థలో పెరిగి పెద్దవారైన అనాధలలో ఎంతోమంది ఉన్నత రంగాలలో వున్నారు. ఎంతో మంది ఇంజనీర్లు, డాక్టర్లు అక్కడ నుండి వచ్చినవారే. వారు తమ కాళ్ళపై తాము నిలబడగలిగిన తరువాత తమకు ఇష్టమైన వారిని వివాహం చేసుకొని బయటకు వెళ్ళిపోయేవారు. మరికొందరు ఆ సంస్థలోనే తిరిగి సేవలు చేసేవారు. శిశుసదన్‌లో పిల్లలను సాకుటకు కొందరు స్త్రీలు నియమింప

బడి జీతభత్యాలు పొందుతున్నారు. ఇంకా ఈ సంస్థలో ఎక్కువ సంతానం వున్న కుటుంబాలలోని పిల్లలు కూడా పోషించబడుతున్నారు.

సంతానం లేనివారు ఇచ్చటి అనాధలను పెంచుకోవచ్చు. ఆ కోరిక కల్గినవారు ఈ శిశుసదనాన్ని దర్శించి తమ పరిస్థితులను వివరించిన వాళ్ళకు తగిన సహాయం అందజేయబడును. విదేశీయులు కూడా ఇచటి పిల్లలను తీసుకొని వెళ్ళి పెంచుకుంటున్నారు. కలకత్తా వీధులలో అనాధలుగా తిరగవలసిన పిల్లలు మదర్ కారణంగా ఇంగ్లాండు, స్విట్జర్లాండు, జర్మనీ, ఫ్రాన్స్ మొదలైన దేశాలలోని ధనవంతుల ఇళ్ళల్లో ఆనందంగా కేరింతలు కొడ్తూ పెరిగి పెద్ద వాళ్ళవుతున్నారు.

కలకత్తా నగరంలో ఆకలిరాజ్యానికి అవధుల్లేవు. ఎందరో అన్నార్థులు వీధులవెంబడి తిరుగుతూ వుంటారు. వీరి దురవస్థను గామనించిన మదర్ థెరిసా శిశుసదన్‌లో అన్నదాన సేవాకార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది. ప్రతీదినం ఉదయం సుమారు 800 మంది బీదలు ఇచ్చట భోజనం చేస్తారు.

ఈ "శిశుసదన్"లు కొన్ని రోజులికి దేశమంతటా, ప్రపంచమంతటా వ్యాపించాయి. స్విట్జర్లాండు రాయబారి మదర్‌ను దర్శించి ఢిల్లీలో ఒక బాలభవనం ఏర్పాటు చేయవలసిందిగా కోరాడు. అవసరమైన ఆర్థిక సహాయం తమ దేశాన్నుండి అందజేస్తానని వాగ్దానం చేశాడు. అదే విధంగా

తొందరలోనే తగిన సహాయం కూడా అందించాడు. మదర్ వెంటనే ఢిల్లీలో ఒక బాలభవనం స్థాపించింది. అనాథ శిశువులెందరో అచ్చట ఆశ్రయాన్ని పొందారు.




జవహర్‌లాల్ నెహ్రూ మదర్‌కు ఉచితంగా విమాన ప్రయాణమునకై పాస్‌ను అందించాడు.

ఈ బాలభవన ప్రారంభోత్సవానికి అప్పటి భారత ప్రధాని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ హాజరయ్యారు. అప్పుడు మదర్ తన కార్యకలాపాలను గూర్చి

వివరించింది. అప్పుడు నెహ్రూగారు నవ్వుతూ "మదర్, నువ్వు చెప్పనవసరంలేదు. నువ్వు చేపట్టిన సేవాకార్యక్రమాలన్నింటిని గురించి నాకు బాగా తెలుసు ఇట్టి ప్రారంభోత్సవాలలో పాల్గొనటం నా అదృష్టమని భావించియే వచ్చాను" అని అన్నారు.

అంతేకాదు. "మదర్ నీవు నీ సేవలు దేశవిదేశాలలో కూడా విస్తరించ దలిచావు. ఇందుకోసం నీవు ప్రపంచమంతటా తిరగవలసి వుంది. అందుకోసం నీకు ఉచితంగా విమానంలో ప్రయాణం చేయడానికి వీలుగా విమాన పాస్‌ను ఇవ్వదలిచాను." అని మదర్‌కు ఆ పాస్‌ను అందించాడు. మదర్ ఎంతో సంతోషంతో ఆ పాస్‌ను అందుకున్నది.

దీనితో తెరీసా యొక్క కార్యకలాపాలు ప్రపంచమంతటా విస్తారమయినాయి. ఈ కార్యక్రమాలకు ఎంతో ధనం కూడా అవసరమైంది. ప్రపంచంలోని ఎన్నో దేశాలనుండి మదర్‌కు బహుమతులరూపంలో ఎంతో ధన సహాయం అందుతుండేది. ఇందుకు ఆమెకున్న భగవద్విశ్వాసమే మూల కారణం.

తెరీసా ఏ విశ్వాసంతో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టుతుందో అవి ఎప్పటికీ వమ్ముకావు. ఒకసారి తెరీసా ఆగ్రాలోని శిశుసదనానికి ఒక భవనం నిర్మించాలనుకుంది. అందుకోసం 50,000 రూపాయలు అవసరమైంది. అంత

ధనం ఎలా సమకూర్చాలా అని ఆలోచిస్తుండగా అప్పుడే ఆమెకు "మేగసాసే" అవార్డు అందింది. అది కూడా 50,000 రూపాయల బహుమతి. భవన నిర్మాణానికి సరిపడునంతధనం. వెంటనే ఆ ధనం అందుకొని భవనాన్ని పూర్తి చేసింది. అందులో దురలవాట్లకుగురై, ఎవరూ పట్టించుకోని పిల్లలు, దొంగతనాలకు, జేబులు కత్తిరించుటకు అలవాటుపడ్డవాళ్ళు చివరకు పోలీసుల చేతిలో చిక్కి వారికికూడా లొంగనివారు చేర్చుకోబడ్డారు. వారందరిలో మదర్. ఆమె సేవికల సేవలు, భావాలు, ఉపన్యాసాలు విని ఎంతో పరివర్తనం కలిగింది. వెంటనే వారందరూ తమ దురలవాట్లను విడిచి సక్రమ మార్గంలో నడపటం మొదలు పెట్టారు.

తెరీసా శిశుసదనాలలో పెరిగే వారికోసం అవసరమైన భోజనపేర్పాట్లు కూడా చేసింది. బిస్కెట్ల ఫ్యాక్టరీనుంచి విరిగిపోయిన బిస్కెట్ల వంటివన్నీ తెరీసా ఆశ్రమానికి పంపబడేవి. ఒకనాడు ఆ ఫ్యాక్టరీ యజమాని అత్యాసకుగురై ఆ బిస్కెట్ ముక్కలను బయటివారికి అమ్ముకుని తెరీసాకు పంపలేదు. దీనితో తెరీసా ఎంతో ఆగ్రహం చెందింది, బాధపడింది. కానీ అదేరోజు ఏదో కారణంతో పాఠశాలలన్నిటికీ సెలవు ప్రకటించబడింది. దీనితో ఆ పాఠశాలలకు నిత్యం సరఫరా అయ్యే పాలు, రొట్టెముక్కలు అసంఖ్యాకంగా మిగిలిపోయాయి.

వీటన్నిటినీ థెరీసా ఆశ్రమానికి తరలించారు. మదర్ భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుకుంది. వెంటనే వెళ్ళి ఆ ఫ్యాక్టరీ యజమానిని కలుసుకొని ఎంతోమంది బీదప్రజలు, పిల్లలు ఏ విధంగా ఆకలి బాధకు గురవుతున్నదీ, వారి యాతనలను, బాధలను అతనికి అర్ధమయ్యేటట్లు వివరించింది. వారందరికీ ఏదో తినడానికి కొంచెము ఏర్పాటు చేయమంది. దానితో ఫ్యాక్టరీ యజమాని తన తప్పును తెలుసుకొని మరుసటి దినం నుండి తప్పకుండా తాను బిస్కెట్ ముక్కలను థెరీసాకు పంపుతానని అని వాగ్దానం చేశాడు.

మూడు దశాబ్దాలుపాటు థెరీసా కలకత్తా నగరంలో, భారతదేశంలో సేవలు చెసిన తరువాత మొట్టమొదటిసారిగా విదేశాలకు వెళ్ళింది. మొట్ట మొదటిసారిగా ఇండియా విడిచి ఐర్లాండు వెళ్ళింది. అక్కడి "నేషనల్ కౌన్సిల్ ఆఫ్ కాథలిక్ ఉమన్" వారిచే ఒక సభకు ఆహ్వానించబడింది. థెరీసా ఆ సభలో మాట్లాడుతూ అక్కడి అమెరికన్ కాథలిక్కులందరికీ బయటి నుండి తనకు సహాయం అందించినందులకు ఎంతో కృతజ్ఞతలు తెలుపుకున్నది. "నేను ఎవ్వరినీ ఏనాడూ ఏదీ అర్ధించలేదు. ప్రజలే నేను చేస్తున్న సేవలను చూచి నాకు విరాళాలను ప్రకటించారు. నేను ప్రజలలోనికిపోయి, హిందూ.ముస్లిం, క్రిష్టియన్ అన్న బేధభావం లేకుండా వారందరికీ సేవలు చేశాను. ఇదే భగ

వంతునికి ఇష్టమయిన కార్యమని భావిస్తున్నాను. దానికోసమే కృషిచేస్తున్నాను" అని తెల్పింది.



మదర్ థెరీసా వాటికన్ సిటీలో పోప్‌ను కలుసుకొని వారికొక పత్రాన్ని సమర్పించింది

అక్కడినుండి మదర్ ఇండియా వచ్చేటప్పుడు స్కోప్జీలో ఆగింది. అక్కడ మదర్ తన సోదరుడయిన లాజర్‌ను కలుసుకుంది. "లాజర్ నీవు ఎంత

ఎదిగిపోయావు" అంటూ మదర్ అతనిని ప్రేమతో కౌగలించుకున్నది. లాజర్ కూడా "గోన్ష బొజాక్షివా! నీవు అచ్చం చూడడానికి తల్లిలా వున్నావు. నీవు నిజంగా విశ్వమాతవు" అని ఆనందభాష్పాలు రాల్చాడు. ఈ విధంగా మదర్ అనేకదేశాలు తిరుగుతూ తన ఆఖరు పర్యటనగా "వాటికన్ సిటీ"కి వచ్చింది. ఆ పర్యటనకు ఎంతో ప్రాముఖ్యం వున్నది. ఆమె అక్కడ పోప్‌ను కలును కుంది. ఆమె వారికొక అభ్యర్ధనా పత్రాన్ని సమర్పించింది. అందులో ఆమె "మిషనరీస్ ఆఫ్ఛారిటీ" సంస్థను "సొసైటీ ఆఫ్ పొంటిఫికల్ రైట్"గా గుర్తించమంది. అది తనకు ప్రపంచంలోని అన్ని దేశాలలో సేవా కార్యక్రమాలు సేవాసంస్థలు ఏర్పాటు చేయడానికి అవకాశం కల్పిస్తుందని తెలియజేసింది. మదర్ అక్కడినుండి తిరిగి భారతదేశానికి వచ్చివేసింది.

మదర్‌కు ఎప్పుడూ తన సేవాకార్యక్రమాలకై ఎదురుచూడడంతెలీదు. తను అనుకున్నది వెంటనే సాధించి తీరుతుంది. మదర్ 1963వ సంవత్సరంలో "మిషనరీ బ్రదర్స్ ఆఫ్ ఛారిటీ" అనే సంస్థను పురుషులతో స్థాపించింది. ఇది స్త్రీలకు సాధ్యమవనటువంటి బరువులు మోయడం, శవాలను తరలించడం,

రోగులను కదలలేని స్థితిలో ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతానికి తరలించడంవంటి వ్యవహారాల్లో వీరు బాగా ఉపయోగపడేవారు.

మదర్ "కో వర్కర్స్" అనే మరో సేవాగ్రూపును కూడా స్థాపించింది. దీనికి నాయకురాలిగా తన అనుచరులలో ఒకరయిన "ఆన్ బ్లెయికీ"ని నియమించింది. ఇందులో పురుషులు, స్త్రీలు, అన్ని మతాలవారు, అన్ని జాతుల వారు సభ్యులుగా వుంటారు. దీని చాలా కాలం వరకు చర్చివారు గుర్తించలేదు. అయినా వీరు మదర్ చేసే సేవాకార్యక్రమాలకు ప్రభావితములయి అనేక సేవలు చేసేవారు.

మదర్ జీవితంలో ఆమె చేసిన సేవలన్నీ ఒకవంతయితే ఆమె అందుకున్న బహుమానాలు, కానుకలు, వాటిని ఉపయోగించిన తీరు మరొక వంతు.

1964వ సంవత్సరంలో బొంబాయి నగరంలో "యుఖరిస్టు కాంగ్రెస్" పేరుతో క్రైస్తవ మతసభ ఏర్పాటయింది. ఆనాటి పోప్ ఆ సభలకు విచ్చేశాడు. అతనికి విమానాశ్రయంలో అప్పటి రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ స్వాగతం పలికారు. విమానాశ్రయంనుండి సభాస్థలివరకు పోప్‌గారిని

తీసుకొని రావడానికి ఒక తెల్లని కారును బహు అందంగా తీర్చిదిద్దారు. ఆ కారును విదేశాలనుండి ప్రత్యేకంగా తెప్పించారు. అప్పట్లో దాని ఖరీదు రెండు లక్షల రూపాయలు చేసింది. దానిని పోప్‌గారికి బహుమతిగా ఇచ్చివేశారు. కానీ పోప్‌గారు దానిని రోమ్‌నగరానికి తీసుకువెళ్ళడానికి నిరాకరించారు. దానిని మానవ సేవలో నిర్విరామంగా మునిగితేలుతున్న మదర్‌కు ఇవ్వాలని నిర్ణయించారు. మదర్‌కూడా ఆ కారును తనకోసం వినియోగించదలచుకోలేదు. దానిని కూడా పేదలకే ఉపయోగించదలచింది. ఆ కారుపై లాటరీటిక్కెట్లు అమ్మించి ఆ ధనాన్ని పేదల సేవకు ఉపయోగించింది.

1962 ఏప్రిల్ నెలలోనే భారతదేశం మదర్ సేవలను గుర్తించి "పద్మశ్రీ" బిరుదును, బహుమతిని అందజేసింది. దానిని అనాటి రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ మదర్‌కు అందజేశారు.

అదే సంవత్సరం ఆగస్టు నెలలో ఫిలిప్పీన్స్ దేశం "మాగ్‌సాస్" బహుమతిని ప్రకటించింది. ఇది మదర్‌కు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిపెట్టింది. ఇదే ఆమెకు మొదటి విదేశీబహుమతి. ఈ ధనాన్ని కూడా మదర్ పేదలసేవకే వినియోగించింది.

అమెరికా ప్రభుత్వం మదర్ సేవలను గుర్తించి 1970వ సంవత్స రంలో సెప్టెంబరు మాసంలో "గుడ్‌సమారిటన్" అవార్డును ప్రకటించి గౌరవించింది.

1971వ సంవత్సరం జనవరి నెలలో పోప్‌పాల్ మదర్‌కు "పోప్‌జాన్ శాంతి బహుమానం" అందజేసారు. అదే సంవత్సరం అక్టోబరు మాసంలో అమెరికా ప్రభుత్వం "కెన్నడీ అంతర్జాతీయ బహుమతిని" అందజేసి మదర్‌ను సత్కరించింది. ఈ బహుమతులనన్నింటినీ మదర్ తన స్వంతవిషయములకు ఉపయోగించకుండా తిరిగి ఆ ధనంతో పేదల సేవలు ఉధృతపరుస్తూ వుండేది.

అంతర్జాతీయ అవగాహనకు యిచ్చే "నెహ్రూ అవార్డు" 1972వ సంవత్సరంలో మదర్‌ను వరించింది. ఈ బహుమతి ప్రధానం అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ చేతులమీదుగా జరిగింది. అప్పుడు మదర్ నిస్వార్థంగా చేసే సేవలను ఎంతోమంది కొనియాడారు.

1975వ సంవత్సరంలో మదర్‌కు "ఆల్బర్టు స్వేట్జర్" బహుమతి "సెరిస్‌మెడల్" సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ విశ్వవిద్యాలయంవారి గౌరవ డాక్టరేట్ ప్రధానం చేయబడ్డాయి.

1976వ సంవత్సరంలో శాంతినికేతన్ విశ్వభారతి విశ్వవిద్యాలయం మదర్ థెరిసాకు గౌరవ డాక్టరేటు ప్రదానంచేసి తన అభినందనలు అందజేసింది.

1977వ సంవత్సరంలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం తరపున "ఫిలిప్" యువరాజు భగవంతునిపై ఆమెకున్న విశ్వాసాన్ని గౌరవిస్తూ మదర్‌కు "డాక్టర్ ఆఫ్ డివినిటీ" డిగ్రీని అందజేసాడు.

మదర్ అందుకున్న బహుమతులన్నింటిలోను ప్రపంచంలోనుఉత్తమ మయినది. అత్యంత ప్రతిష్టకరమయినదీ "నోబెల్ బహుమతి" 1979వ సంవత్సరపు "నోబెల్ బహుమతి" మదర్‌ను వరించింది. మదర్ ఎంతో ఆనందించింది. కానీ తాను ఆనందించింది తనకు నోబెల్ బహుమతి వచ్చినందుకు కాదు. పేదప్రజలందరికీ తాను చేస్తున్న సేవను గుర్తింపు వచ్చినందుకు, కేవలం పేద ప్రజలకే ప్రపంచమంతా గుర్తింపు వచ్చినట్లు తన నోబెల్ బహుమతిని భావించింది. వారి కోసమే ఆ బహుమతిని అందుకోవాలనుకుంది.

డిశంబరు 10వ తేదీ 1979వ సంవత్సతంలో మదరును స్వీడన్ దేశపు రాజధాని అయిన స్టాక్ హోమ్‌లో ఘనంగా సత్కరించి ఆ నోబెల్ బహుమతిని అందజేశారు. తెరీసాకు ఆ బహుయతి క్రింద ఒక బంగారు పతకము. ప్రశంశా

పత్రము. విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేట్ మరియు 15,20,000 రూపాయలకు సమానమైన విదేశీ మారకద్రవ్యము ఇచ్చారు. అంతేకాదు అక్కడివారు మదర్ సేవలకు ఆనందించి ఎన్నెన్నో విరాళాలను కూడా సమర్పించారు.

మదర్ అక్కడ జరిగిన సభలో తాను ఆ ధనాన్నంతటినీ కేవలం భారతదేశంలోని పేదప్రజలు అభ్యున్నతికే వినియోగిస్తానన్నది. అక్కడినుండి మదర్ భారతదేశానికి వచ్చింది. ఢిల్లీలోని పాలం విమానాశ్రయంలో ఆమెకు భారతీయులు ఘనంగా స్వాగతం పలికారు. నోబెల్ బహుమతి సంపాదించటం ద్వారా మదర్ భారతదేశ ఖ్యాతిని మరింత ఇనుమడించింది.

ఆ తరువాత మదర్ కలకత్తాలోని ఒక రోడ్డుపై నడిచి వెళ్ళుచుండగా ఒక బిచ్చగాడు ఎదురువచ్చి, "అమ్మా! మీ సేవలో భాగంగా నేనుకూడా మీ కోసం ఏదైనా సాయం చేయాలని ఎప్పటినుండో అనుకుంటున్నాను. దయచేసి ఈ సహాయాన్ని మీరు తీసుకోండి" అంటూ ఒక పదిపైసలు మదర్ చేతిలో పెట్టాడు. థెరీసా హృదయం ఎంతో ఉప్పొంగిపోయింది. "యీ చిరుకానుక నాకు వచ్చిన నోబెల్ బహుమానం కన్నా గొప్పది. ఇది నాకెంతో విలువైంది." ఇన్ని సత్కారాలు, బహుమతులు వచ్చినా తెరీసాకు ఏమీ ఆస్తిపాస్తులు లేవు. బీదప్రజలు, రోగ పీడితులు, కుష్టువ్యాధిగ్రస్తులూ, పసిపిల్లలు, అనాధలు వీరే తన ఆస్థిపాస్తులని నమ్మకుంది. మరియు తన ఆస్థి హిమాలయ పర్వతాల శిఖరాలంత గొప్పదని భావిస్తుంది.

థెరిసా యొక్క ఖ్యాతి ప్రపంచమంతటా వ్యాపించింది. ఎన్నో దేశాలు అనేక బిరుదులు, బహుమతులు, సత్కారాల ద్వారా థెరిసా సేవలను అభినందించారు. భారతప్రభుత్వం ఆమెకు 1980వ సంవత్సరంలో ఉన్నతమైన



కలకత్తాలో ఒక రోడ్డుపై మదర్ వెళుతుండగా ఒక బిచ్చగాడు
ఎదురువచ్చి తానుకూడా ఆమె సహాయంలో పాలుపంచు
కుంటానని చెప్పి ఆమెచేతిలో ఒక నాణాన్ని పెట్టాడు

"భారతరత్న" బిరుదును ఇచ్చి గౌరవించింది. అంతేకాదు ప్రపంచంలోని అనేక దేశాలు సభ్యత్వం కలిగివున్న ప్రపంచ వ్యాప్తంగా వ్యాపించి ఉన్న ఐక్యరాజ్య సమితి మరియు ఎఫ్.ఎ.ఒ. "సిరెస్ మెడల్"ను మదర్‌కు బహూకరించాయి.

ఈనాడు ప్రపంచం మొత్తాన్ని కూడా గుభేలుపరుస్తున్న ఎయిడ్స్ భయంకరవ్యాధి నిర్మూలనకు కూడా థెరీసా సేవాలయాలను స్థాపించుచున్నది. ఇప్పటికే ఆమె వయస్సు 80 సంవత్సరాలు, అయినా వయస్సును సైతం లెక్క-చేయక ఆమె చేస్తున్న సేవా కార్యక్రమాలు హర్షించదగ్గవే కానీ వయస్సును దృష్టిలో ఉంచుకొని ఆమె కొంత సమయాన్ని విశ్రాంతికి కూడా కేటాయిస్తూ సేవలు చేస్తుంటే ఎంతో బాగుంటుంది.

ఎక్కడో యుగోస్లావియా దేశంలో పుట్టి చిన్న వయస్సులో భారత దేశానికి వచ్చి, చేతిలో పైసా ధనం లేకుండా ఏ విధమైన పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసి ధనం సంపాదించకుండా, కేవలం తన ఆత్మ విశ్వాసం, కార్యదీక్ష, పట్టుదల నిజాయితీతో ఎందరో రోగులకు, పేదలకు, అనాధలకు, బాలబాలికలకు, విద్యార్థులకు, నిరుద్యోగులకు సేవలు అందించి, నిస్వార్థంగా సేవలుచేసి ప్రపంచ ఖ్యాతిని ఆర్జించి, ప్రపంచంలోని వివిధ దేశాల మన్ననలను, పురస్కారాలను, బహుమతులను, కానుకలను అందుకొని, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో సేవా కార్యక్రమాలు విస్తారంగా చేపట్టి ప్రపంచ ప్రజలందరికీ, సమస్త జీవనానికి తల్లిగా దగ్గరయిన ఆమె, మదర్ థెరీసా, ఆరోగ్యానికి ఏదైనా అస్వస్థత చేకూరితే

ప్రపంచమే అల్లకల్లోలమైపోతుంది. ఆమెకు 1989వ సంవత్సరం చివరి ప్రాంతంలో తీవ్ర అస్వస్థత కలిగింది. ప్రపంచంలో ప్రజలందరూ ఎంతో ఆందోళన చెందారు. ఎందరో తెరీసాకు స్వస్థత చేకూరాలని భగవంతుని ప్రార్థించారు. ఎందరో దీనులు, తేరీసా సేవలు పొందినవారు దీనంగా విలపించారు. భారత దేశంలోని అత్యున్నత వైద్య సహాయం ఆమెకు అందించారు. చివరకు కోట్లాది దీనులు ఆవేదన, ఆశల, ప్రార్ధనల ఫలితంగా ఆమె ఆ గండం నుండి బయట పడ్డారు. అందరూ స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నారు.

ఒక్క మదర్ థెరీసాయే భారతదేశంలోనే కాకుండా ప్రపంచం మొత్తం మీద ఎంతో మంది మదర్ థెరీసాలను తయారుచేసిన మహనీయురాలు. ఆమె నిజంగా ప్రపంచానికీ విశ్వానికీ మదరు, తల్లిలాంటిది. ఆమె మరికొన్ని సంవత్సరాలు ఆయురారోగ్యాలతో వర్థిల్లుతూ మరిన్ని సేవలు చేయాలని ఆశిద్దాం. అనాథలు, బాలబాలికలు, అభాగ్యుల జీవితాలలో వెలుగులు నింపి వారి జీవితాలలో చిరునవ్వులు చిందించిన మహాత్మురాలు, మానవతామూర్తి. ఆ తెరీసా జీవితం కూడా ఆ చిన్నారుల చిరునవ్వులంతటి నిర్మలమయినది. అంతటి నిర్మలమైన పవిత్రమైన ఆమె జీవనం మరికొన్ని ఏళ్ళపాటు సుఖశాంతులతో, ఆనంద ఉత్సాహాలతో సాగాలని అందుకోసం ఆ భగవంతుని అవసరమైన అన్ని సహాయాలను అందివ్వవలసిందిగా ప్రార్థిద్దాం ——

